ప్రజాపక్ష

# సమీక్ష

మార్చ్ 1 - 15, 2003 | సమతా పబ్లికేషన్స్ ప్రచురణ | వెల రు. 5-00



లోపలి పేజీల్లో.....



వార్షిక చందా రూ|| 120/-లు

Edited, printed and published by
**V. Hanumantha Rao**
for **Samata Publications**
D.No. 8-3-898/22, Road No.3,
Nagarjuna Nagar,
Hyderabad - 500 073.
Phone : 23748672

DTP at : Sri Sai Shamili Graphics
Golnaka, Hyd. Ph. 2756 9274

Printed at : Charita Graphics
Chikkadpally, Hyderabad - 020.

సంపాదకీయం :

## బడ్జెట్ల విశ్లేషణ

**బడ్జెట్ల** సీజన్ వచ్చేసింది. సామాన్యుడికెపుడూ లోతు కడుపు, లోటు బడ్జెట్, యూజర్ ఛార్జీల వడ్డనతో, రాష్ట్ర ప్రజలు మరింత లోటు బడ్జెట్లతో వచ్చే సంవత్సరం, ఆ తర్వాతి సంవత్సరాలలో, కాపురం చేయాల్సిందే. ఈ పరిస్థితికి తాగు నీరులోటు తోడయింది. ఈ "అలగా" జనానికి ప్రభుత్వ దయాదాక్షిణ్యాలు నిరంతరం లోటు. ఇలా అన్నిటికీ లోటుతో సంసారం సాగించాలంటే ఇంట్లో శాంతి లోటు ఏర్పడుతుంది. అలాంటి వారికి ప్రభుత్వ బడ్జెట్లతో పనిలేదు. గుడ్డి కన్ను మూస్తే ఎంత, తెరిస్తే ఎంత అన్నట్లు, బడ్జెట్ ప్రచురిస్తే ఎంత, ప్రచురించకపోతే ఎంత? ప్రభుత్వాలకు కూడా వేళాపాళా లేదు. బడ్జెట్ రాకముందే ధరల పెంపుదల వల విసిరాయి. బస్సు ఛార్జీలు, పెట్రోలు ధరలు, ఆహార ధాన్యాల కనీస ధరల్లాంటివి ప్రభుత్వం పెంచితే, మాతోడ్పాటు మీకు ఎల్లప్పుడూ వుంటుందని వ్యాపారులు వంటనూనె ధరల్లాంటి వాటిని పెంచేశాయి. ఇలా మద్దెల దరువు వేసిన తర్వాత, లోటుకు లోతుకు తేడా లేకుండా పోతుంది. ప్రభుత్వాలు మాత్రం కాకుల్లెక్కలు చూపించి దేశంలో రాష్ట్రంలో దరిద్రం తగ్గిపోయిందంటుంది.

రైళ్ళు గత సంవత్సరం అంతా కొంతమంది ప్రయాణీకులను నేరుగా ఎవరికీ అందుబాటులోలేని, తిరిగిరాలేని దూర తీరాలకు తీసుకొని పోయాయి. ఈసారి ఛార్జీలు పెంచలేదని, పెంచబోవటం లేదని ముందు తెలిసివుంటే వాళ్ళెంత సంతోషంగా చనిపోయి వుండేవారో. అదే సంవత్సరంలో దేశంలో కొన్ని రైల్వే జోన్లు మరణించాయి. కొత్త జోన్లు, కొత్త రైల్వే డివిజన్లు అవతరించాయి. అసలే నిధుల్లేక గిలగిలలాడుతుంటే, కొత్త జోన్లు ఏర్పాటు చేసి మరింత ఖర్చుభారాన్ని నెత్తిన కుమ్మరించింది. అపుడు జోన్ల పునర్విభజనా రాజకీయమే. ఇపుడు ఛార్జీలు పెంచకపోవటం రాజకీయమే, రైళ్ళు నడవడానికి రాజకీయాలే ఇంధనమైపోయాయి. వినిమయ దారునికి సంతృప్తి కలగించే సంవత్సరంగా ఈ రాబోయే సంవత్సరాన్ని పరిగణిస్తారట. ఆ సంతృప్తి, అసంతృప్తి మాట అటుంచి, స్టేషన్లలో వచ్చే మూడు నెలల్లో మంచి నీళ్ళు అందుబాటులో వుంచితే, అదే పదివేలు.

# 2000-01 నుంచి 2003-04 రాష్ట్ర బడ్జెట్ వివరాలు

| క్రమ సంఖ్య | రంగం | అకౌంట్లు 2001 - 02 | | | బి.ఇ. 2002 - 03 | | | ఆర్.ఇ. 2002-03 | | | బి.ఇ. 2003-04 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ప్రణాళికేతర | ప్రణాళిక | మొత్తం | ప్రణాళికేతర | ప్రణాళిక | మొత్తం | ప్రణాళికేతర | ప్రణాళిక | మొత్తం | ప్రణాళికేతర | ప్రణాళిక | మొత్తం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| **ఎ.** | **ఆర్థిక సేవలు** | **26382.05** | **6538.05** | **32920.09** | **20619.55** | **7614.41** | **28233.96** | **21606.44** | **6508.48** | **28114.92** | **22570.74** | **8396.94** | **30967.67** |
| I. | వ్యవసాయం, అనుబంధరంగాలు | 545.83 | 248.74 | 794.56 | 530.3 | 462.65 | 992.95 | 592.56 | 347.29 | 939.84 | 551.2 | 615.01 | 1166.21 |
| I. | గ్రామీణాభివృద్ధి | 1804.37 | 960.36 | 2764.73 | 1731.57 | 1166.31 | 2897.89 | 1816.81 | 803.55 | 2620.36 | 2061.51 | 1505.99 | 3567.50 |
| II. | సేద్యపు నీటిపారుదల, వరద నియంత్రణ | 1428.08 | 960.36 | 2764.73 | 1731.57 | 1166.31 | 2897.89 | 1816.81 | 803.55 | 2620.36 | 2061.51 | 1505.99 | 3567.5 |
| III. | ఇంధనం | 623.46 | 2614.83 | 3238.29 | 39.21 | 2523.43 | 2562.64 | 37 | 2167.18 | 2204.18 | 37.7 | 2058.86 | 2096.56 |
| IV. | పరిశ్రమలు, ఖనిజాలు | 73.53 | 172.67 | 246.21 | 51.08 | 242.26 | 293.34 | 49.2 | 234.32 | 283.52 | 50.63 | 324.55 | 375.18 |
| V. | రవాణా | 609 | 769.48 | 1378.48 | 766.28 | 800.45 | 1566.73 | 771.33 | 775.6 | 1546.93 | 838.04 | 984.31 | 1822.35 |
| VI. | వైజ్ఞానికశాస్త్ర సాంకేతిక పర్యావరణం | 1.37 | 3.71 | 5.08 | 1.52 | 1.58 | 3.09 | 1.26 | 1.02 | 2.27 | 1.29 | 1.02 | 2.3 |
| VII. | సాధారణ ఆర్థిక సేవలు | 21296.41 | 386.04 | 21682.44 | 15775.84 | 624.83 | 16400.67 | 16683.2 | 563.92 | 17247.11 | 17235.86 | 728.27 | 17964.13 |
| **బి.** | **సామాజిక సేవలు** | **6120.62** | **2431.8** | **8552.42** | **6252.8** | **3560.27** | **9813.07** | **6083.03** | **3382.51** | **9465.54** | **6474.7** | **4646.97** | **11121.67** |
| IX. | సాధారణ విద్య | 3299.38 | 393.76 | 3693.13 | 3634.63 | 733.85 | 4368.48 | 3573.18 | 625.15 | 4198.34 | 3797.71 | 1106.44 | 4904.15 |
| X. | క్రీడలు, యువజనసేవలు | 5.18 | 57.45 | 62.63 | 6.55 | 76.1 | 82.65 | 16.45 | 65.9 | 82.36 | 8.74 | 120.53 | 129.26 |
| XI. | సాంకేతిక విద్య | 80.77 | 6.92 | 87.68 | 80 | 8.28 | 88.27 | 81.12 | 6.47 | 87.59 | 87.98 | 6 | 93.98 |
| XII. | కళలు, సంస్కృతి | 29.3 | 3.08 | 32.38 | 25.97 | 10.11 | 36.08 | 25.31 | 8.22 | 33.53 | 26.31 | 8.75 | 35.06 |
| XIII | వైద్యం | 861.69 | 533.35 | 1395.04 | 1018.81 | 529.76 | 1548.58 | 909.25 | 592.44 | 1501.69 | 976.79 | 711.83 | 1688.62 |
| XIV | నీటి సరఫరా, పారిశుధ్యం | 59.22 | 357.81 | 417.04 | 61.74 | 413.82 | 475.56 | 63.77 | 422.31 | 486.08 | 66.49 | 424.23 | 490.72 |
| XV | గృహనిర్మాణం | 319.7 | 136.61 | 456.31 | 332.53 | 192.38 | 524.91 | 266.31 | 125.92 | 392.23 | 282.16 | 255.17 | 537.34 |
| XVI | పట్టణాభివృద్ధి | 524.31 | 195.37 | 719.68 | 438.46 | 289.61 | 728.08 | 502.66 | 334.16 | 836.82 | 547.67 | 392.07 | 939.75 |
| XVII | సమాచార పౌరసంబంధాలు | 38.11 | 15.33 | 53.64 | 36.52 | 8.56 | 45.08 | 37.56 | 5.86 | 43.42 | 40.72 | 5 | 45.72 |
| | ఎస్.సి., ఎస్.టి., మైనారిటీ సంక్షేమం | 711.24 | 482.72 | 1193.96 | 444.74 | 896.1 | 1340.84 | 420.54 | 866.36 | 1286.9 | 455.51 | 1082.75 | 1538.26 |
| | కార్మిక, ఉపాధి | 55.22 | 11.6 | 66.81 | 39.48 | 36.11 | 75.59 | 55.25 | 20.56 | 75.81 | 57.29 | 1.5 | 78.8 |
| | సామాజిక భద్రత, సంక్షేమం | 136.51 | 237.62 | 374.16 | 133.37 | 365.59 | 498.95 | 131.62 | 309.16 | 440.78 | 127.31 | 512.7 | 640.01 |
| | సాధారణ భద్రత, సంక్షేమం | 1170.21 | 135.33 | 1305.54 | 1248.29 | 154.82 | 1403.11 | 1199.83 | 163.69 | 1363.52 | 1259.63 | 161.65 | 1421.28 |
| **సి.** | **సాధారణ సేవలు** | **1170.21** | **135.33** | **1305.54** | **1248.29** | **154.82** | **1403.11** | **1199.83** | **163.69** | **1363.52** | **1259.63** | **161.65** | **1421.28** |
| | సాధారణ సేవలు | 1170.21 | 135.33 | 1305.54 | 1248.29 | 154.82 | 1403.11 | 1199.83 | 163.69 | 1363.52 | 1259.63 | 161.65 | 1421.28 |
| | **మొత్తం (అన్ని కలిపి)** | **33672.43** | **9075.02** | **42747.45** | **28120.5** | **11299.5** | **39420.01** | **28889.17** | **9998.43** | **38887.6** | **30304.88** | **13175.56** | **43480.44** |

ప్రజాపక్ష సమీక్షకు రచనలు, ఉత్తరాలు పంపించవలసిన చిరునామా :

వి. హనుమంతరావు

8-3-898/22, రోడ్ నెం. 3,

నాగార్జున నగర్,

హైదరాబాద్ - 500 073.

(చందాలు, విరాళాలు, చెక్కులు, డిమాండ్ డ్రాఫ్టులు 'వి. హనుమంతరావు' పేరిట పంపాలి.)

వచ్చే సంచికలో......

☆ ఇరాక్‌పై అమెరికా యుద్ధం - అసలు కారణాలు.

☆ రాష్ట్రాన్ని కబళిస్తున్న కరవు

☆ అయోధ్య - రాజకీయ ఎత్తుగడలు

# మెత్తటి మాటల్లో సంస్కరణల కత్తి

-వి. కొమరయ్య

కేంద్ర ఆర్థికమంత్రి జస్వంత్‌సింగ్ ఫిబ్రవరి 28న పార్లమెంటులో ప్రవేశపెట్టిన 2003-04 బడ్జెట్ ఎన్నికల కోసం ఉద్దేశించిన ప్రజాకర్షక బడ్జెట్ అని, అభివృద్ధికి దారి తీసే బడ్జెట్ అనీ వ్యాఖ్యాతలు ప్రశంసిస్తున్నారు. అంకెల గారడీ వెనక దాగిన అసలు వాస్తవాన్ని విస్మరించడానికి, విస్మరింపచేయడానికి పెద్ద ఎత్తున ప్రయత్నాలు సాగుతున్నాయి. ఆకర్షణీయమైన భాషలో భ్రమలు కల్పించే పద్ధతిలో ప్రవేశపెట్టబడిన ఈ బడ్జెట్ వాస్తవికంగా సంపన్న వర్గాలకు మేలు చేసేదిగా, బహుళజాతి సంస్థలకు, ప్రపంచీకరణ క్రమానికే ప్రయోజనకరంగా ఉంది.

జస్వంత్‌సింగ్ మొట్టమొదటిగా బడ్జెట్ రచనాపద్ధతినే మార్చివేసారు. ఇంతకాలం కేంద్ర ఆర్థికమంత్రి బడ్జెట్ ప్రసంగంలో 2 భాగాలుండేవి. పార్ట్ - ఏ గా పిలిచే ప్రభుత్వపు స్థూల రాజకీయార్థిక విధానం, ప్రాధాన్యతలు, లక్ష్యాలు, ఆ లక్ష్యాలని చేరడానికి ఉపయోగించుకునే సాదనాలు వంటి స్థూల సాధారణ అంశాలు ఉండేవి. పార్ట్ - బి ఈ సాధారణావకాశాలను నిర్దిష్ట రంగాలకు అన్వయించి పన్నుల విధానం గురించి, ద్రవ్య విధానం గురించి, ఎగుమతి - దిగుమతుల గురించి, సుంకాల విధానం గురించి, ప్రతిపాదనలు ప్రకటించేది. అంటే బడ్జెట్‌లో అధ్యయనం చేయదల్చుకున్న వారికి పార్ట్ - ఏ లో ప్రభుత్వ లక్ష్యాలు, పార్ట్ - బి లో ఆ లక్ష్యాలను సాధించడానికి చర్యలు - అవగతమయ్యేవి. 10 భాగాలుగా 196 పేరాలలో సాగిన బడ్జెట్ ప్రసంగం లక్ష్యాలను, సాధనాలను కలగలపి ముద్ద చేసింది. ఇది కేవలం పద్ధతికి సంబంధించిన సమస్య కాదు. బహుశా ఆర్థిక మంత్రి ఉద్దేశ పూర్వకంగా తమ లక్ష్యాలేవో కనబడకుండా చేయడానికి, అస్పష్టం చేయడానికి ప్రయత్నించారు. అంతకు ముందు సంవత్సరం లాగా లక్ష్య ప్రకటనలోనే అంటే పార్ట్-ఏ లోనే బహిరంగంగా, నిస్సిగ్గుగా ప్రపంచీకరణ క్రమాన్ని, ఆర్థిక సంస్కరణ లను కొనసాగిస్తామని చెప్పడం. ఎన్నికల ముందు రాజకీయంగా సరైన చర్య కాదని ఆయన అనుకున్నట్లున్నారు. అట్లాగే ప్రజా జీవితం మీద ప్రతికూల ప్రభావం వేయగల కఠినమైన చర్యలను నేరుగా, ఒకేచోట చెప్పడంకన్నా ఆ చేదు మాత్రలకు చక్కెర పూతపూసిన వాక్యాలను అంటించడం అవసర మని అనుకున్నట్లున్నారు.

ఒకవైపు నిత్య జీవితావసరాలైన వంటనూనెల మీద, అన్ని సరుకుల ధరలను పెంచివేసే పెట్రోలు, డీజిల్, ఎరువుల మీద సుంకాలు పెంచి వాటిని ప్రియం చేసిన బడ్జెట్ కార్లు శీతల పానీయాలు, బిస్కట్లు, వజ్రాల మీద సుంకాలు తగ్గించి ప్రజా కర్షక బడ్జెట్‌గా నటించడం ఈ పద్ధతి మార్పువల్లనే ఆర్థిక మంత్రికి సులభం అయ్యింది.

లక్ష్య ప్రకటన స్థానంలో జస్వంత్‌సింగ్ కొత్తగా ప్రవేశపెట్టిన అంశం ప్రభుత్వం తన ముందు పెట్టుకున్న 5 ప్రాధాన్యతాంశాల ప్రకటన. ఈ 5 అంశాలు ఒకవైపు ప్రజలను భ్రమల్లో ముంచడానికి, మరో వైపు దేశీయసంపన్నులకు, వ్యాపార పారిశ్రామిక వర్గాలకు, బహుళ జాతి సంస్థలకు, ఏ విధంగా సహకరించనున్నాయో పరిశీ లించవలసి ఉంది. 'పాంచ్ ప్రయారిటీస్' అని జస్వంత్ సింగ్ ప్రతిపాదించిన 5 ప్రాధాన్యతాంశాలు : 1. ప్రజల జీవితకాల కోర్కెలైన ఆరోగ్యం, ఆశ్రయం, విద్య, ఉద్యోగాలను తీర్చడం ద్వారా దారిద్ర్యనిర్మూలన. 2. మౌలిక సాధన సంపత్తి అభివృద్ధి. 3. పన్నుల సంస్కరణల ద్వారా ద్రవ్యవిధానాన్ని సంఘటితం చేయడం.4. నీటి పారుదలతో సహా వ్యవసాయరంగ అభివృద్ధి. 5. ఎగుమతులను, సంస్కరణల క్రమాన్ని ప్రోత్సహించడంద్వారా పారిశ్రామిక రంగ అభివృద్ధి.

పైకి చూడటానికి ఈ అయిదు ప్రాధాన్యతలలో కొత్తదనం ఏమీ కనిపించదు. దాదాపు ప్రతి ఆర్థికమంత్రి, ప్రతి బడ్జెట్‌లోనూ ప్రకటిస్తున్న అంశాలే ఇవి. మొదటి అంశం 50 సంవత్సరాలుగా భారత పాలకవర్గాలు ప్రతీ బడ్జెట్‌లోనూ ప్రతి విధాన ప్రకటనలోనూ ప్రకటిస్తున్న అంశమే. గరీబీ హఠావో అని. రోటీ కపడా ఔర్ మకాన్ అనీ, ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యూహమని నూతన ఆర్థిక విధానమని, ఆర్థిక సంస్కరణలని గత 5 దశాబ్దాలలో ఎన్నెన్ని పేర్లతో ఈ లక్ష్యాలే ప్రకటించుకున్నప్పటికీ రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలే ఈ ఆదర్శాలను ప్రకటించినప్పటికీ, జస్వంత్‌సింగే చెప్పినట్లు ప్రజల జీవితకాల కోర్కెలు యావజ్జీవ కోర్కెలుగానే ఉండిపోయాయి. రెండు తరాలు గడిచినా ఆరోగ్యం, ఆశ్రయం, విద్య, ఉపాధి అనే నాలుగు అంశాలు దేశ జనాభాలో మూడింట రెండు వంతుల మందికి అందని ఫలాలే అయ్యాయి. ఈ నేపథ్యంలో అవే ఆదర్శాలను మరొక్కసారి ప్రకటిస్తున్నప్పుడు ఆ ఆదర్శాలను నెరవేర్చే మార్గాలేమిటి? వాటికొరకై తీసుకోనున్న చర్యలేమిటి? వాటి కోసమై వెచ్చిస్తున్న నిధులెన్ని? లాంటి నిర్దిష్టమైన ప్రశ్నలకు జవాబులు

చెప్పవలసి ఉంటుంది. కేంద్ర బడ్జెట్ 2003-04 ఈ ప్రశ్నలకు జవాబులు చెప్పలేదు సరికదా. అంకెల గారడీతో, మోసపూరిత నినాదాలతో ఆ జవాబులను దాటవేయడానికి ప్రయత్నించింది.

ఆరోగ్యరంగంలో ప్రజలకు ఆరోగ్యం అందించడం అనే పేరుతో ప్రభుత్వం చేయదలచిన పని - వైద్య, ఆరోగ్యరంగాలను ప్రైవేట్ పెట్టుబడిదారులపరం చేయడం. ఆరోగ్యరంగంలో ప్రభుత్వానికి ఉన్న మూడు లక్ష్యాలుగా జస్వంత్‌సింగ్ ప్రకటించినవి. జాతీయ ఆరోగ్యాన్ని ఇనుమడింపచేయడం, భారతదేశాన్ని అంతర్జాతీయ ఆరోగ్యసేవల గమ్యస్థానంగా మార్చడం. ప్రజలకు సులభసాధ్యంగా అందుబాటులోకి తేవడం. జాతీయ ఆరోగ్యాన్ని ఇనుమడింపచేసే లక్ష్యమే ప్రభుత్వానికి ఉంటే ఎక్కువ వైద్య శాలలను తెరవడం, గ్రామీణ ప్రాంతాలలో వైద్య ఆరోగ్య సౌకర్యాలను మెరుగుపరచడం. మన వాతావరణంలో సాధారణంగా ప్రబలే వ్యాధుల గురించి, అవసరం అయిన చికిత్సల గురించి పరిశోధనలకు నిధులు కేటాయించడం ప్రజలకు ఎక్కువగా అవసరం అయ్యే ఔషధాల ధరలు తగ్గించడం చేయాలి. బడ్జెట్ వీటిలో ఏ ఒక్క అంశాన్నీ కనీసం ప్రస్తావించనైనా ప్రస్తావించలేదు. జాతి ఆరోగ్యాన్ని ఎంచుకున్న ఏకైకమార్గం ప్రైవేటు ఆస్పత్రులను, ఐదు నక్షత్రాల ఆస్పత్రులను ప్రోత్సహించడం. ఎన్నో రకాల వైద్య పరికరాలపై ఎక్సైజ్, కస్టమ్స్ సుంకాలలో రాయితీలు ప్రకటించారు. 100 పడకలు, ఆపైన నెలకొల్పదలచుకున్న ప్రైవేటు ఆస్పత్రులకు ఎన్నో రాయితీలు ప్రకటించారు. అంటే ఇప్పటికే విస్తరిస్తూ ఉన్న ప్రైవేటు వైద్య ఆరోగ్య వ్యవస్థ ఇంకా పెంచడానికి బడ్జెట్ మార్గం సుగమం చేస్తుంది. ప్రైవేటు ఆస్పత్రులు, ఐదు నక్షత్రాల ఆస్పత్రులు ఈ రాయితీల వలన. విపరీతంగా పెరిగిపోయి వాటి వైద్యసేవలను ఎంత తక్కువ ధరలకు అందించినా ఆ తక్కువ ధరలను భరించే శక్తికూడా సామాన్య ప్రజానీకానికి లేదు. అంటే అంతిమంగా ఈ ఆస్పత్రులు ఈ దేశ సంపన్నులకు గానీ విదేశీ సంపన్నులకు గానీ ఉపయోగపడతాయి. ఒకవైపు డాలర్ మారకపు రేటు వల్ల మరోవైపు ఈ రాయితీలవలన పాశ్చాత్య దేశాలతో పోలిస్తే భారత దేశపు వైద్య ఆరోగ్య సేవలు కారు చౌకగా ఉన్నాయి. ఆధునిక పరికరాలు దిగుమతి చేసుకోవడానికి రాయితీ ఇవ్వడం ద్వారా, పాశ్చాత్య నగరాలలోని ఆస్పత్రులలోని సేవలకు సమానమైన నాణ్యమైన సేవలు మన ఆస్పత్రుల్లో పదోవంతుకు ఇంకా అంతకన్నా తక్కువకు దొరుకుతాయి. అందువల్ల ఆరోగ్య సేవల్లో భారతదేశాన్ని అంతర్జాతీయ గమ్యస్థానం చేయాలన్న ఆశయం నెరవేరుతుందేమో కానీ, దానిలో జాతి ఆరోగ్యం బాగు పడేది ఏమీ లేదు.

ఇక ఆశ్రయ కల్పనను మౌలిక అవసరంగా గుర్తించిన ఆర్థిక మంత్రి కొత్త గృహ కల్పన పథకాలకు, మొత్తంగా గృహనిర్మాణ రంగానికి కేటాయింపుల గురించి ప్రస్తావనే చేయలేదు. గృహ నిర్మాణరంగం అనే శీర్షిక కింద ఒకే ఒక్క పేరాగ్రాఫ్‌లో ఉద్యోగస్తుల గృహనిర్మాణ రుణాల మీద పన్ను రాయితీల గురించి మాత్రం మాట్లాడారు. అంటే దేశ జనాభాలో గృహనిర్మాణ రుణాలకు అర్హులైన 10-20 శాతం మంది గురించి మాత్రమే ఆయన మాట్లాడుతున్నారన్నమాట.

విద్యారంగం గురించి బడ్జెట్ ప్రతిపాదనలను రెండు స్థాయిలలో చూడాలి. మొదటిది విద్యారంగానికి మొత్తంగా బడ్జెట్ కేటాయింపులు. డి.సి.కోఠారి కమీషన్ రోజుల నుండి మూడున్నర దశాబ్దాలుగా జాతీయోత్పత్తిలో కనీసం 6% విద్యకు కేటాయించా లని ఆదర్శం ఉన్నప్పటికీ ఏ ప్రభుత్వమూ అందులో సగం స్థాయికి కూడా చేరలేదు. 2003-04 బడ్జెట్ కూడా 2% కేటాయింపులతో విద్యారంగం మీద తన ప్రత్యేకమయిన శ్రద్ధ ఏమీ లేదని చూపుతుంది. మరో స్థాయిలో విద్యారంగానికి చాలా మేలు కల్పించే ప్రతిపాదనలాగా చూపెడుతున్న ట్యూషన్ ఫీ చెల్లింపులకు వ్యక్తిగత ఆదాయ పన్ను మినహాయింపు చూస్తే ప్రభుత్వపు అసలు ఉద్దేశం తేటతెల్లం అవుతుంది. తల్లిదండ్రులు, సంరక్షకులు తమ పిల్లల చదువు మీద పెట్టే ఖర్చులో 12,000 రూ॥ వరకూ ఆదాయపన్ను రాయితీ ఇస్తారట. మరో మాటలో చెప్పాలంటే పిల్ల చదువుల కోసం పన్నెండువేలు ఖర్చుపెట్టి పన్నురాయితీ పొందండి అని ప్రభుత్వమే ప్రోత్సహిస్తున్నదన్నమాట. రాజ్యాంగ ఆదేశిక సూత్రమైన నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య 14 సంవత్సరాలలోపు పిల్లందరికీ కల్పించాలనే ఆదర్శం రద్దయిపోయింది. విద్య ప్రైవేటీకరణ ప్రమాదకరమయిన ఫలితాలకు దారితీస్తుందనే అభిప్రాయం గాలి కెగిరిపోయింది. ప్రభుత్వమే స్వయంగా పిల్లల విద్య మీద ఎంత ఖర్చు పెట్టాలో సూచించి ఆ పని చేస్తే తాయిలాలిస్తాననే పరిస్థితి వచ్చింది. ఇది విద్యారంగ అభివృద్ధి కాదు. విద్యారంగంలో ప్రైవేట్ లాభాపేక్షాపరులకు ప్రోత్సాహం.

మొదటి ప్రాధాన్యతలో చివరి అంశం అయిన ఉపాధి కల్పన గత 10 సంవత్సరాల ప్రపంచీకరణ క్రమంలో వెనుకపట్టు పట్టిందని ఒకరోజు ముందు ప్రవేశపెట్టిన ఆర్థిక సర్వే స్పష్టం చేసింది. ఈ బడ్జెట్ కొత్త ఉద్యోగకల్పన గురించి మాట్లాడలేదు సరికదా ఇంకా ఎన్ని ప్రభుత్వరంగ పరిశ్రమలను మూసివేయాలో, ప్రైవేటీకరించాలో అంటే కొత్తగా ఎన్ని ఉద్యోగాలు పోగొట్టాలో సూచించింది. గ్రామీణాభివృద్ధి కింద ప్రధానమయిన ఉపాధి పథకాల కేటాయింపులనుంచి 18,376 కోట్ల రూపాయలను 17,070 కోట్ల రూపాయలకు తగ్గించింది. అంటే మొత్తం మీద ఉద్యోగ కల్పన తన ప్రాధాన్యత అని చెప్పుకున్నప్పటికీ, నిరుద్యోగ కల్పన దిశగానే బడ్జెట్ ప్రతి పాదనలు సాగాయి.

ఆరోగ్యం, ఆశ్రయం, విద్య, ఉపాధి వంటి జీవితకాల కోర్కెలను తీర్చడం ద్వారా దారిద్ర్యనిర్మూలన చేస్తానని చెప్పుకున్న బడ్జెట్ మాటల్లో ఏమి చెప్పనప్పటికీ, చేతలలో అందుకు విరుద్ధమైన దిశలోనే చర్యలు ప్రకటించిందని పై విశ్లేషణ తెలియజేస్తుంది.

రెండో ప్రాధాన్యతా అంశంగా మౌలిక సౌకర్యాలు అభివృద్ధి కోసం ఇతోధికంగా ఆలోచనలు చేస్తున్నానని బడ్జెట్ ప్రకటించింది.

ఈ చెప్పిన అభివృద్ధంతా జరిగితే దేశం చాలా ముందుకు పోతుందని అందువల్ల ఇది ప్రగతిశీల బడ్జెట్‌అనీ వ్యాఖ్యాతలు ప్రశంసిస్తున్నారు. అయితే 60,000 కోట్ల రూపాయల మౌలిక సాధన సంపత్తి అభివృద్ధి ప్రణాళికను ప్రకటించిన బడ్జెట్ వాస్తవంగా ఆ సౌకర్యాల కల్పనకు ఈ సంవత్సరానికి చేసిన కేటాయింపులు 2,000 కోట్ల రూపాయల కన్నా ఎక్కువ లేదు. మిగిలిన నిధి ప్రైవేటు సంస్థల నుంచో, విదేశీ రుణ సంస్థల నుంచో, ప్రజలనుంచో సేకరిస్తామనే అస్పష్టమయిన ఆకాంక్ష తప్ప ఈ అంశంలో కూడా భ్రమపాలు ఎక్కువ. వాస్తవికతపాలు తక్కువ. ఈ మౌలిక సాధన సంపత్తిలో 40,000 కోట్ల రూపాయలతో 48 రోడ్లు, ఢిల్లీ - బొంబాయిల్లో ప్రభుత్వ - ప్రైవేటు భాగస్వామ్యంలో రెండు కొత్త విమానాశ్రయాలు, హైద్రాబాద్ - బెంగుళూరులలో రెండు ప్రైవేట్ విమానాశ్రయాలు, నవీ-ముంబాయి-కొచ్చిన్‌లలో నౌకాశ్రయాలు, 8,000 కోట్లతో జాతీయ రైలు వికాస్‌యోచన వంటి వాటితో పాటు, 1000 కోట్ల రూపాయల ఖర్చుతో రెండు సమావేశ మందిరాల (కన్వెన్షన్ సెంటర్స్) నిర్మాణం వంటివి కూడా ఉన్నాయి.

మౌలిక సౌకర్యాల కల్పన చాలా అవసరమే. మౌలిక సౌకర్యాల వల్లనే ఆర్థిక వ్యవస్థ వికాసానికి అవకాశం కలుగుతుంది. మౌలిక సౌకర్యాల మీద శ్రద్ధ పెట్టవలసిందే. కాని మౌలిక సౌకర్యాలను లాభనష్టాలలెక్కలలో చూడకుండా సామాజిక శ్రేయస్సు దృష్టితో చూసే ప్రభుత్వరంగ పాత్ర హెచ్చుగా ఉండాలి గానీ, తక్షణ లాభాలనాశించే ప్రయివేట్ రంగం చేతుల్లో ఉండ కూడదు. రోడ్లు, రైలు మార్గాలు, విద్యుచ్ఛక్తి, నీటి పారుదల వంటి మౌలిక సౌకర్యాలు ప్రైవేట్ రంగం చేతుల్లో ఉంటే ప్రైవేట్ రంగపు లాభాపేక్ష వలన నడవడం. ప్రయాణించడం, విద్యుత్ వాడు కోవడం, నీరు వాడుకోవడం సామాన్య ప్రజానీకానికి అందని గగన కుసుమాలైపోతాయి. బడ్జెట్ 2003-04 మౌలిక సాధన సంపత్తిని అభివృద్ధి చేస్తాననే పేరుమీద నిజానికి చేస్తున్న పని ప్రజల నిత్య జీవితావసరాలన్నింటి మీద ప్రైవేట్ రంగానికి నియంత్రణాధి కారాన్ని కట్టబెట్టడమే.

మూడో ప్రాధాన్యతాంశం : పన్నుల విధానంలో సంస్క రణలు. బడ్జెట్ ప్రతిపాదనల్లో మామూలుగా ఉండే పన్ను ప్రతిపాదనలు, ఎక్సైజ్, కస్టమ్స్ సుంకాల ప్రతిపాదనలు వంటి వాటితో పాటు ఈసారి బడ్జెట్‌లో ఉన్న మరో ముఖ్యఅంశం వాల్యు ఆడెడ్ ట్యాక్సేషన్ (వ్యాట్) ప్రతిపాదనలు. నిజానికి వ్యాట్ ప్రతిపాదనలు బడ్జెట్‌తో సంబంధం లేకుండా ప్రపంచబ్యాంకు ఆదేశాలమేరకు 4 సం॥లుగా జరుగుతూ వస్తున్న క్రమంలో భాగమే. ఈ మూడో అంశం చెప్పే క్రమంలోనే మాటలు మార్చినప్పటికీ జస్వంత్ సింగ్ తన ప్రభుత్వ మౌలిక లక్ష్యమేమిటో స్పష్టంగానే ప్రకటించారు. బడ్జెట్ మీద భారం తగ్గించడమే తన లక్ష్యమనే ప్రకటన ద్వారా ఆర్థికమంత్రి చెప్పదలచినదేమంటే సంక్షేమ రంగాల మీద వ్యయం తగ్గించి, కనపడే ప్రత్యక్ష పన్నులు కూడా కొంత తగ్గించి, కనపడని పరోక్ష పన్నులు విపరీతంగా పెంచి - ఈ చర్యల ఫలితంగా ద్రవ్యలోటు తగ్గించి ప్రపంచబ్యాంకు ఆదేశాన్ని పాటించడమే.

కార్లు, ఆడియో సి.డి.లు, క్యాసెట్లు, ఎయిర్ కండిషనర్లు, కంప్యూటర్లు, బిస్కెట్‌లు, శీతల పానీయాలు, బంగారం, వజ్రాలు, ముడి ఉన్ని వస్త్రాలు, వస్త్ర పరిశ్రమకవసరమైన యంత్రాలు, నీటి సరఫరా పరికరాలు, విదేశీ మద్యం, పోలీ ఫైబర్ యార్న్, టెలికాం, ఐ.టి.రంగాల యంత్ర పరికరాలు మొదలైన వస్తువుల మీద సుంకాలను, పన్నులను తగ్గించడం ద్వారా వాటి ధరలు తగ్గక పోయినా నిలకడగా ఉండేట్లు చేశానని బడ్జెట్ చెప్తుంది. వీటిలో పారిశ్రామిక రంగానికి, సంపన్న వర్గాలకు అవసరమైన వస్తువుల ధరలు తగ్గినా తగ్గకపోయినా ప్రజాజీవితం మీద పెద్ద ప్రభావం లేదు. కానీ ప్రజలకు అవసరం అయిన వస్తువుల ధరలు, సుంకాల తగ్గింపు వలన తగ్గిపోయే సందర్భం వచ్చినా అది వాస్తవం కాకపోయే ఒక స్థితిని ఈ బడ్జెట్ ప్రతిపాదించింది. అన్ని సరుకుల రవాణా మీద ప్రభావం చూపి ధరలుపెంచే పెట్రోలు, డీజిల్ మీద సుంకాలను పెంచింది. పెట్రోల్, డీజిల్, ఎరువుల ధరలు పెరగడం అనేది ఒక వలయంలాగా ఇతర అన్ని సరుకుల ధరలను పెంచుతుంది. అంటే అంతిమంగా పన్నుల సుంకాల తగ్గింపు అని బడ్జెట్ ఇస్తున్న హామీ నిష్ప్రయోజనమైపోయి ధరల పెరుగుదల మాత్రమే నిజమవుతుంది.

పన్నుల విధానంలో మరొక ముఖ్య అంశం అయిన వ్యక్తిగత ఆదాయపన్ను విషయంలో చేసిన మార్పులు, ప్రైవేటు విద్య వైపు, ప్రైవేటు వైద్యం వైపు ఉద్యోగస్తులను నెట్టేందుకు వేసిన ఎత్తుగడలే. పన్నుల విధానంలోనే భాగంగా ఇప్పటిదాకా వసూలు చేస్తున్న సర్‌ఛార్జిని తగ్గించినట్లు నటిస్తూ సర్వీస్ ఛార్జీని 5 శాతం నుంచి 8 శాతానికి పెంచడం ద్వారా సేవారంగ వినియోగం పెరుగుతున్న ఈ రోజుల్లో ఈ బడ్జెట్ చర్య ప్రజల జేబుల నుండి ఇంకా ఎక్కువ కొట్టేయడానికే దారితీస్తుంది. పరోక్ష పన్నుల విషయం లోనూ, సర్వీస్ ఛార్జీ విషయంలోనూ పారిశ్రామిక వ్యాపార సంపన్న వర్గాల పన్నుల విషయంలో మాత్రం ఎక్కడలేని ఔదార్యాన్ని ప్రకటించింది. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ పరిశ్రమకు రాయితీలను కొనసాగించింది. వైద్యరంగంలో పరికరాల దిగుమతికి రాయితీలు కల్పించింది. సిమెంటు, స్టీలు, భారీ యంత్ర సామాగ్రి వంటి మౌలిక సౌకర్యాలరంగానికి టెలికామ్ వంటి రంగాలకు రాయితీలను ప్రకటించింది. మొత్తంగా పారిశ్రామిక రంగానికి ఇచ్చిన రాయితీల న్నింటివలనా సంపూర్ణంగా లాభపడే పారిశ్రామిక గృహం రిలయన్స్ అని పారిశ్రామిక వేత్తలలోనే ఒక బృందం వ్యాఖ్యానిస్తోంది.

పన్నుల విధానంలోనే రెండవ దశ. అయిన వ్యాట్ గురించి ప్రత్యేకంగా చర్చించవలసి ఉంది. కానీ బడ్జెట్ సమయంలో

భారతీయ జనతాపార్టీ ద్వంద్వ వైఖరి గురించి మాత్రం చెప్పుకోవాలి. వ్యాట్ అమలు వల్ల వ్యాపార వర్గాలకు నష్టం జరుగుతుందని సరిగ్గా బడ్జెట్‌కుముందు భారతీయ జనతాపార్టీ ఢిల్లీ బంద్‌కు పిలుపు నిచ్చింది. ఢిల్లీ మాజీ ముఖ్యమంత్రి, భారతీయ జనతా పార్టి నాయకుడు మదన్‌లాల్ ఖురానా ఆ బంద్‌కు నాయకత్వం వహించి నిర్వహించారు. 24 గంటలు తిరగకుండా అదే ఖురానా జస్వంత్‌సింగ్ పక్కన కూర్చుని వ్యాట్ అనుకూలబడ్జెట్ వాదనలను సమర్థించారు. సొంత రాజకీయ వైఖరి ఒకవైపున ప్రపంచబ్యాంకు ఆదేశాల ముల్లుగర్ర మరోవైపున లాగుతున్న సమయంలో ఈ బడ్జెట్‌ను అర్థం చేసుకోవాలి.

నాలుగో ప్రాధాన్యతాంశంగా నీటి పారుదల సౌకర్యాలతో సహా వ్యవసాయాభివృద్ధి అని జస్వంత్‌సింగ్ ప్రకటించారు. కానీ నీటి పారుదలకు గానీ, వ్యవసాయరంగానికి గానీ ఈ బడ్జెట్ చేసిందేమీ లేదు. ఎరువుల ధరను పెంచిన విషయం పైనే చూశాం. వ్యవసాయము అనుబంధ రంగాలకు కేటాయింపులు గత సంవత్సరం రు. 3,733 కోట్లు కాగా అది రు. 3,219 కోట్లకు సవరించబడింది. అంటే అంచనా వేసినదానికన్నా ఖర్చు పెట్టింది రు. 514 కోట్లు తక్కువ అన్నమాట. 2003-04 సంవత్సరానికి రు. 3866 కోట్లు అంచనాగా ఇప్పుడు చూపించారు. గత సంవత్సరం అంచనా కన్నా ఇది కేవలం రు. 133 కోట్లు మాత్రమే ఎక్కువ. అంటే 0.3 శాతం మాత్రమే పెరుగుదల. ధరల పెరుగుదలతో పోల్చిచూసినపుడు వాస్తవ కేటాయింపులు గత సంవత్సరం కన్నా తక్కువన్న మాట. అలాగే నీటిపారుదల, వరదల నియంత్రణకు గత సంవత్సరం రు. 443 కోట్లు కేటాయించగా రు. 281 కోట్లు ఖర్చుచేశారు. మళ్ళీ ఈ సంవత్సరం కేటాయింపు రు. 443 కోట్లు మాత్రమే. ప్రాధాన్యతా రంగంగా గుర్తిస్తున్నానని చెప్పిన రంగం పరిస్థితే ఇలా ఉంటే మిగతా రంగాల పరిస్థితి ఎలా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు.

చివరి ప్రాధాన్యతాంశంగా జస్వంత్‌సింగ్ ప్రకటించిన అంశం బహుశా ప్రభుత్వపు మొట్టమొదటి ప్రాధాన్యతాంశం అయి ఉంటుంది. అది ఎగుమతుల ప్రోత్సాహం, సంస్కరణ క్రమాన్ని వేగవంతం చేయడం ద్వారా పారిశ్రామిక రంగాన్ని అభివృద్ధి చేయడం. డివిడెండ్ల మీద క్యాపిటల్ గెయిన్స్ మీద పన్నురాయితీ ప్రకటించడం ద్వారా వస్త్ర, ఔషధ, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయో టెక్నాలజీ, పర్యాటక, వజ్రాలు - ఆభరణాల పరిశ్రమల మీద రాయితీలు ప్రోత్సాహకాలు ప్రకటించడం ద్వారా, మరొక 75 రంగాల నుండి చిన్న తరహా పరిశ్రమలను డీరిజర్వ్ చేయడం ద్వారా నిజంగానే పారిశ్రామికరంగం ఇతోధికంగా లాభాలు పొందటానికి ఈ బడ్జెట్ మార్గం సుగమం చేసింది. ఆయా పరిశ్రమాధిపతులు లాభాలు పొందటమే దేశ సంక్షేమమా? ప్రజా ప్రయోజనకరమా? అనేది వేరే చర్చ.

మొత్తంగా చూసినపుడు బడ్జెట్ 2003-04 కొట్టవచ్చినట్లుగా కఠినం అయిన నిర్ణయాలేవీ ప్రకటించకపోయినప్పటికీ అంతిమంగా ప్రజా వ్యతిరేక, ప్రపంచబ్యాంకు నిర్దేశిత ఆర్థిక సంస్కరణల మార్గాన్ని చేపట్టింది. కఠినమైన నిర్ణయాలు లేకపోవటం కూడా ఎన్నికల మీద దృష్టితో ముఖ్యంగా మధ్య తరగతి ఉద్యోగ వర్గాలను ఆకర్షించే ఎత్తుగడగానే తప్ప ప్రభుత్వపు మౌలిక స్వభావం మారలేదని బడ్జెట్ ప్రతిపాదనలు నిశితంగా విశ్లేషిస్తే అర్థమవుతుంది. ❑



## వివిధ రంగాల ప్రణాళికా పెట్టుబడులు

(కోట్ల రూపాయల్లో)

| | 2002-03 బడ్జెట్ అం. | 2002-03 సవ. అం. | 2003-04 బడ్జెట్ అంచనా |
|---|---|---|---|
| బడ్జెట్ మద్దతు : | 66871 | 68219 | 72152 |
| పబ్లిక్ రంగ సంస్థలకు బడ్జెట్, బడ్జెటేతర వనరులు | 77167 | 68648 | 75741 |
| వివిధ రంగాలకు మొత్తంగా | 144038 | 136867 | 147893 |
| బడ్జెట్ ప్లాన్ : | | | |
| వ్యవసాయం. అనుబంధ రంగాలు | 3733 | 3219 | 3866 |
| గ్రామీణాభివృద్ధి | 7973 | 12834 | 8181 |
| నీటిపారుదల. వరదల నియంత్రణ | 443 | 281 | 443 |
| ఇందనం | 36306 | 36825 | 43379 |
| ఖనిజాలు | 7993 | 7114 | 7598 |
| రవాణా | 32041 | 27812 | 28784 |
| కమ్యూనికేషన్స్ | 19540 | 14214 | 14903 |
| శాస్త్ర సాంకేతిక, పర్యావరణం | 4414 | 4022 | 4696 |
| సాధారణ ఆర్థిక సర్వీసులు | 29376 | 28461 | 31689 |
| సాధారణ సర్వీసులు | 434 | 397 | 409 |
| మొత్తంగా ప్లాన్ | 144038 | 136867 | 147893 |

## మంత్రిత్వ శాఖలు, విభాగాలకు కేటాయింపులు

| | | | |
|---|---|---|---|
| వ్యవసాయ మంత్రిత్వశాఖ | 3242 | 2632 | 3242 |
| వ్యవసాయ, సహకార శాఖ | 2167 | 1667 | 2167 |
| వ్యవసాయ పరిశోధన విద్యాశాఖ | 775 | 725 | 775 |
| పశుసంవర్ధక, పాల ఉత్పత్తిశాఖ | 300 | 240 | 300 |
| వ్యవసాయ, గ్రామీణ పరిశ్రమల శాఖ | 580 | 580 | 580 |
| అణుశక్తిశాఖ | 2741 | 2686 | 4106 |
| రసాయనాలు, ఫెర్టిలైజర్ శాఖ | 1112 | 830 | 1168 |
| పెట్రో రసాయనాలు | 213 | 59 | 108 |
| ఫెర్టిలైజర్ శాఖ | 899 | 771 | 1060 |

# నేలచూపులు చూస్తున్న దేశ ఆర్థిక పరిస్థితి

- వి. హనుమంత రావు

**తాను** విదేశాంగ శాఖ మంత్రిగా వున్నప్పుడు దేశంలోకాక అమెరికాలోనే ఎక్కువ కాలం గడిపి, అమెరికా ప్రభుత్వనేతలతో భుజాలు రాసుకొంటూ తిరిగిన నేటి తాజా ఆర్థికమంత్రి జస్వంత్ సింగ్ ప్రవేశపెట్టిన ఆర్థిక సమీక్ష చదువుతుంటే అమెరికా వాసనలు, అక్కడే వేంచేసివున్న ప్రపంచబాంకు షరతులవాసనలు ముక్కు పుటాలు అదరగొడుతున్నాయి.

చిన్నమొత్తాల పొదుపు ఉద్యమంలో వడ్డీ ఆదాయం ఎక్కువ వస్తుందనే ఆశతో సామాన్యులు పొదుపు చేసుకొన్న సొమ్ముమీద వడ్డి తగ్గించాలట. ఆహార ధాన్యాలు, ఎరువులు, కిర్సనాయిలు, గ్యాస్ సబ్సిడీలు తగ్గించాలట. జీతభత్యాలు కోత విధించాలట. యూజర్ ఛార్జీలు వసూలు చేయాలట. ఫించన్ల బరువు దించుకోవాలట. అసంఘటిత రంగాన్ని పిండుకోవటం ప్రారంభించాలట. విదేశీమారకం నిల్వలు దండిగా వున్నాయి కాబట్టి, దిగుమతులు ఎక్కువగా చేసుకొని ఆ నిల్వలను తగ్గించుకోవాలట. విదేశీ పెట్టుబడులను ఇంకా ధారాళంగా అనుమతిస్తే దేశంలో పెట్టుబడులు పెరుగుతాయట. గత 12 సంవత్సరాలుగా ప్రపంచబాంకు సరిగ్గా ఈ మార్పులనే సంస్కరణల పేరుతో మన నెత్తిన రుద్దుతూ వచ్చింది. వీటిని చదువుతుంటే సమీక్ష తయారుచేసింది ప్రపంచబ్యాంకు, కింద సంతకం పెట్టింది జశ్వంత్ అని అనిపిస్తుంది.

వ్యవసాయం : ఆహార ధాన్యాల ధరలే మొత్తం ధరల పోకడను ప్రభావితం చేస్తుంటాయి. రాజకీయ ఒత్తిడులమేరకు ఉత్పత్తి, ఖర్చునుమించి, మార్కెట్‌లో ధరకన్నా ఎక్కువగా కనీస మద్దతు ధరను ప్రభుత్వం పెంచుతూ రావడంతో, రైతులు సహజంగానే ఫుడ్ కార్పోరేషన్‌కే అమ్మటంతో నిల్వలు ఆరుకోట్ల టన్నులకు (ఇపుడు కొంచెం తగ్గాయనుకోండి) పెరిగిపోయాయి. ఈ కనీస మద్దతు ధరను వాస్తవంగా ఉత్పత్తిఖర్చు మేరకు తగ్గించాలని సమీక్ష సూచిస్తోంది. కనీస ధర పెంచడంతో సబ్సిడి భారం కూడా 96-97లో రూ. 9434 కోట్ల నుంచి 02-03లో రు. 21200 కోట్లకు పెరిగింది.

ఇది ఒక సమస్య అయితే, ఉత్పత్తి ఖర్చుకన్నా తక్కువ ధరకు ఎగుమతులు చేసి నష్టపోవటం జరుగుతోంది. నిల్వలు 4.8 కోట్ల టన్నులకు తగ్గినా, ఉండాల్సిన నిల్వలకన్నా మూడు రెట్లు వున్నాయి. రెండోపక్క, మాకు గిట్టుబాటుధర లభించటం లేదు మొర్రో అని రైతులు గోలచేస్తున్నారు. ధర వరల సమస్యతో తమ వద్దనున్న నిల్వలకు ధరపలక్క, రెండో పక్క చేసిన అప్పులు తీరకపోవటంతో ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. దీనికి కనీస మద్దతు ధరను ప్రస్తుత స్థాయిలో స్థంభింపచేయటం లేదా ధాన్య సేకరణ 2.4 - 3 కోట్ల టన్నులకు తగ్గేలా చూడటం" పరిష్కారమని సమీక్ష చెబుతూంది. అది సరైన పరిష్కారమేనా? సమీక్షలో వ్యవసాయం గురించిన అధ్యాయం తిరగేస్తే అంతా బియ్యం, గోధుమ, టీ, కాఫీలు, తప్ప చెరకు, వేరుశనగ, నూనె గింజల గురించి పూర్తి విశ్లేషణలేదు. ముఖ్యంగా ధారాళంగా పంచదార దిగుమతి అవుతుంటే, దేశంలో పంచదార మిల్లుల్లో నిల్వలు పేరుకొనిపోవడం, ఫలితంగా సరఫరా చేసిన చెరుకు రైతులకు చెల్లింపులు చేయలేకపోవటంలాంటి విషయాల గురించి ప్రస్తావనే లేదు. అయితే 03-04 బడ్జెట్‌లో ఎరువుల సబ్సిడీ తగ్గించడం జరిగింది. సబ్సిడీ తగ్గించటంవల్ల ధరపెరిగి, వినిమయం తగ్గుతుందని ఇప్పటికే 18069 వేల టన్నుల నుంచి 01-02లో 17360 వేల టన్నులకు పడిపోయిందని, ఫలితంగా ఆహారధాన్యాల ఉత్పత్తి తగ్గుతుందని, విదేశాలనుంచి దిగుమతి అయ్యే ఎరువుల ధర తక్కువగా వుండడంతో, దేశంలోని ఎరువుల కర్మాగారాలు మరింత నష్టాలపాలవుతాయని ఒక వాదన. కాదు, ప్రభుత్వం రిటెన్షన్ ధరను చెల్లించే హామీ వుండడంతో ప్రభుత్వరంగంలోని ఎరువుల సంస్థలు తమ ఉత్పత్తి ఖర్చును తగ్గించుకొని, సమర్థతను పెంచుకొనే ప్రయత్నం చేయటంలేదని, అందుమూలంగా కోట్ల రూపాయలు సబ్సిడీ ఈ సంస్థలకు ఇవ్వాల్సి వస్తుందని, ఇది అసమర్థతకు సబ్సిడి ఇవ్వడమేనని నిర్ణయమేననేది మరో వాదన. రైతుకే సబ్సిడీ ఇస్తున్నట్లు ప్రభుత్వం ప్రచారం చేసుకొంటూంది. కాని వాస్తవంలో ఈ సబ్సిడీ ఇస్తున్నది ఎరువుల ఫ్యాక్టరీలకు, ఇప్పుడున్న సబ్సిడీ తగ్గిస్తే, ఎక్కువ చెల్లించాల్సింది రైతే. పరిష్కారం సబ్సిడి తగ్గించడంకాదు. రిటెన్షన్ ధర విధానాన్ని రద్దు చేసి ఎరువుల కర్మాగారాలు సమర్థవంతంగా పనిచేసేలా చూడాలి. అదే సమయం లో సబ్సిడివేరు. రైతుకు అందే వ్యవస్థను రూపొందించాలి.

బడ్జెట్ ప్రసంగంలో వ్యవసాయరంగానికి బాంకులు వసూలు చేస్తున్న వడ్డీరేటు 14-15 శాతం నుండి 8-12.75 శాతానికి తగ్గించటం. రైతులకు పెద్ద వరంలాంటిది. అయినా, సాగు నీరు,

విత్తనాలు, పురుగుమందులు, బయోటెక్నాలజీ లాంటి సవాలక్ష సమస్యలను, అన్నిటికన్నా ముఖ్యం వ్యవసాయంలో పెట్టుబడులు పెంచే ప్రస్తావన సమీక్ష ప్రస్తావించలేదు. సమీక్షను ప్రచురించిన పత్రికలు సమీక్షలోవున్నా కూడ ప్రజలకు చెప్పని కొన్ని విషయాలు ఉన్నాయి. తిండిగింజలు, పప్పుదినుసుల తలసరి నికర దైనిక లభ్యత 1997లో 503 గ్రాములనుండి 2001 అంచనా ప్రకారం 414 గ్రాములకు పడిపోయింది. నీటి సౌకర్యం వున్న పంటభూమి 96-97 / 98-99 మధ్య 22 మిలియన్ హెక్టార్ల మధ్య స్థంభించింది. హెక్టారుకు బియ్యం సగటు ఉత్పాదకత 96-97/01-02 మధ్యకాలంలో 1600-1740 కిలోల మధ్యనే తచ్చాడుతుంది. ఆహార ధాన్యాలు పండించే పంట భూమి విస్తీర్ణం సూచి 90-91లో 100.7 శాతం వుండగా, 01-02 వరకూ ఆ స్థాయిని మించలేదు సరికదా, 96-98 మధ్యనే ఊగిసలాడుతోంది. ప్రజల కొనుగోలు శక్తి పడిపోవటంవల్ల చౌక దుకాణాల ద్వారా విడుదల 1996లో 18.3 మిలియన్ టన్నుల నుండి, 2001లో 13.2 మి.టన్నులకు పడిపోయింది. ఈ స్థంభన లేక తగ్గుదలలు ఉన్న వ్యవసాయం మీద ఆధారపడే 70 శాతం మంది ప్రజల జీవన ప్రమాణాలను ప్రతికూలంగా ప్రభావితం చేస్తుందని వేరే చెప్పాల్సిన పనిలేదు.

**మౌలిక సౌకర్యాలు** : మౌలిక సౌకర్యాలు పెంచాలని, పటిష్టం చేయాలని, ప్రభుత్వ ఆర్థిక సమీక్షలో పునరుద్ఘాటించని సంవత్సరమూ లేదు, అవి అభివృద్ధి అయిన దాఖలాలు లేవు. విద్యుత్తు, ఉక్కు, సిమెంటు ఈ మూడింటి అభివృద్ధి రేటు 97-98లో 5.7 శాతం నుంచి 01-02లో (తాత్కాలికం) 3 శాతానికి తగ్గింది. రైల్వేకార్గో ట్రాఫిక్ పైన ఉదహరించిన కాలంలో 5 నుంచి 4 శాతానికి, ఓడ రేవుల్లో కార్గో 10.7 నుంచి 2.3 శాతానికి, కొత్త టెలిఫోన్ కనెక్షన్ల పెరుగుదల రేటు 27.1 వేల నుంచి 23.9 వేలకు తగ్గినట్లు సమీక్ష తెలియజేస్తుంది.

**సామాజిక సేవలు** : విద్య, వైద్యం, మంచినీరు, గృహ నిర్మాణం, ఎస్సీ, ఎస్టీ, వెనుకబడిన తరగుతుల సంస్థలు, కార్మికులు, గ్రామీణాభివృద్ధి, మురికికాలువల అభివృద్ధి, పి.ఎం. ఆర్.వై., పి.ఎం.జి.ఎస్.వై పథకాలకు చేసిన ఖర్చు ప్రతీ నూరు రూపాయల జాతీయాదాయంలో 00-01లో కేవలం 1.7 రూపాయలు మాత్రమేనని సమీక్షాపత్రం చెబుతూంది. కేంద్ర ప్రభుత్వం మొత్తం ఖర్చులో సామాజిక సేవలకోసం చేసిన ఖర్చు శాతం 92-93లో 17.40 నుండి 00-01 లో 15.50 శాతానికి తగ్గింది. ప్రణాళికలో ఈ సేవలకు చేసిన ఖర్చు కూడా. కేటాయింపుల్లో భాగంగా 99-00లో 27.9 నుంచి 02-03 (బ.అం)లో 25.2 శాతానికి తగ్గింది. ఈ సేవల్లో ఉదాహరణకి విద్యా విషయం చూస్తే సమీక్ష ఇలా వ్రాసింది. "ప్రాథమిక విద్యారంగాన్ని అనేక సమస్యలు ముసురుకొని వున్నాయి. పాఠశాలల్లో ఆధునిక మౌలిక సౌకర్యాలు, ఏకోపాధ్యాయ పాఠశాలలు, ఉపాధ్యాయులు పాఠశాలలకు హాజరు కాకపోవటం, పెద్ద ఎత్తున ఖాళీగా వున్న టీచర్ పోస్టులు .......పాఠశాలల యాజమాన్యం స్థానిక సంస్థల చేతుల్లోవుండాలి."

**నిరుద్యోగం** : 1999-2000లో ఉద్యోగ నిరుద్యోగాల గురించి ఎన్.ఎస్.ఎస్. జరిపిన 55వ రౌండు సర్వే ప్రకారం 1983-94లో రోజువారీ ఉపాధి లెక్కల ప్రకారం సంవత్సరానికి 2.7 శాతం చొప్పున తరుగుతూ వచ్చిన ఉద్యోగావకాశాలు 94-00 నాటికి 1.07 శాతానికి తగ్గిపోయాయని సమీక్ష తెలియజేస్తుంది. అదే సమయంలో స్థూలజాతీయాదాయం పెరిగింది. అంటే తక్కువ మందితో ఎక్కువ పని చేస్తున్నారన్నమాట. ఈ సర్వే తెలియజేసిన మరికొన్ని విషయాలేమంటే 1) కార్మిక శక్తి పెరుగుదల తీవ్రంగా పడిపోతుండడంతో ఉద్యోగావకాశాలు పెరుగుదల రేటు పడిపోయింది. 2) నిరుద్యోగం పెరిగింది 3) వ్యవసాయంలో ఉపాధి అవకాశాలు స్థంబించిపోయాయి. ఫలితంగా మొత్తం ఉద్యోగాల్లో వ్యవసాయం కల్పిస్తున్న ఉపాధి శాతం పైన ఉదహరించిన కాలంలో 60 శాతం నుంచి 57 శాతానికి తగ్గిపోయింది. 4) అదే సమయంలో సేవారంగంలో మూడు రంగాల్లో తప్ప మిగతా రంగాల్లో సంవత్సరానికి అయిదు శాతం చొప్పున పెరిగాయి. కార్మికుల్లో, కాజువల్ కార్మికుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. ప్రభుత్వరంగంలో ఉద్యోగాల పెరుగుదల క్షీణించింది. సంఘటిత రంగాల్లో మార్చి 2001 నాటికి పనిచేస్తున్నవారి సంఖ్య 27.8 మిలియన్లు, 2001లో ఈ ఉద్యోగుల సంఖ్య తగ్గింది. ఎంప్లాయ్ మెంట్ ఎక్స్ఛేంజి లెక్కల ప్రకారం నమోదు చేసుకొన్న నిరుద్యోగుల్లో ప్రతి నలుగురిలో ఒకరు స్త్రీ అయి వుండటం గమనార్హం. ప్రతీ నూరుమంది పురుషులకు దేశంలో సగటున 26మంది కి ఉపాధి లభిస్తుంటే ఆంధ్రప్రదేశ్‌లో 21 మందికి మాత్రమే ఉపాధి కల్పిస్తూ 23వ స్థానంలో వుంది.

360 పేజీల ఆర్థిక సమీక్షలో ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ప్రభుత్వ యంత్రాంగం వైఫల్యాలను ప్రభుత్వ సమీక్షే ఎత్తి చూపింది. 2002-03 సంవత్సరంలో ఇటీవలి కాలంలో ఎన్నడూ చూడనంత కరువు పరిస్థితి ఏర్పడింది. కాగా వచ్చే సంవత్సరం సమీక్షలో దేశంలో పరిస్థితులు ఇంకా అధ్వాహ్నస్థితికి చేరుకుంటా యని చెబుతుందనటంలో సందేహం లేదు. ❑

పశు వైద్యశాలల్లో కూడా యూజర్ ఛార్జీలు వసూలు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. గ్రామీణ, పట్టణ పశు వైద్యశాలల్లో ఈ ఛార్జీలు. వేర్వేరుగా వుంటాయి. పశువుల నరానికి ఇంజక్షన్ చేస్తే రు.15, పెద్ద ఆపరేషన్ రు. 200, చిన్న ఆపరేషన్ రు.100 లు, కృత్రిమ గర్భోత్పత్తికి రు.20, మొయ్యదిగితే రు.100, మాయ వేయకపోతే రు.50, ఎక్స్‌రే తీసినందుకు రు.100, మత్తు మందిచ్చి చికిత్స చేయడానికి రు.50లు వసూలు చేయాలని నిర్ణయించింది. గ్రామీణ ప్రాంతాల వైద్యశాలల్లో ఈ రేట్లు కొద్దిగా తగ్గించారు.

**- విశాలాంధ్ర 22 డిసెంబర్ 02.**

# రైల్వే ఛార్జీలు పెంచలేదు సరే, కాని......

- రాహవి

**గత రైల్వేబడ్జెట్‌లో** నడ్డి విరిగేలా రు. 1700 కోట్ల భారాన్ని మోపిన రైల్వేమంత్రి ఈసారి ఎటువంటి అదనపు భారాలూ మోపకుండా రైల్వే బడ్జెట్‌ను ప్రతిపాదించటం ముదావహమే. ప్రయాణీకులు కాస్త ఊపిరిపిల్చుకుంటారు. అయితే ఇది ఎన్నికల రైల్వే బడ్జెట్ అని వేరే చెప్పాల్సిన పనిలేదు. దానితోపాటు మరో కారణం కూడా వుంది. గత సంవత్సరం ఛార్జీలు పెంచటం వలన ప్రయాణీకులనుంచి ఆదాయం మూడు శాతం తగ్గింది. నితీష్ కుమార్‌కు ముందు మమతా బెనర్జీ రైల్వే మంత్రిగా వున్నప్పుడు రెండు రైల్వే బడ్జెట్లలో ఎటువంటి భారాలు మోపకుండా రైళ్ళు నడిపించింది. కాగా నితీష్‌కు ప్రత్యేకంగా కితాబు నివ్వాల్సినదేమీ లేదు. అప్పుడామెగాని, ఇపుడీయన గాని ఛార్జీలు పెంచకపోవడానికి కారణాల ప్రజలమీద ప్రేమతో కాదు, వారి వారి రాజకీయాల అవసరాలు మీద ప్రేమతో మాత్రమే.

నడుస్తున్న సంవత్సరం "ప్రయాణీకుల సంవత్సరం" గా పరిగణిస్తున్నామని ప్రకటించిన రైల్వే యాజమాన్యం, వాస్తవంలో ప్రయాణీకుల మరణాల సంవత్సరంగా అమలు పరచింది. బహుశా 200 మందైనా మరణించారు. గత బడ్జెట్‌లో రైళ్ళు ఢీకొనకుండా రక్షణకవచ పథకం ప్రవేశపెట్టామని రైల్వేమంత్రి ఇపుడు మళ్ళీ ఉపన్యాసంలో అలా ఢీకొనకుండా ఏదో పరిష్కారాన్ని కనుగొన్నట్లు, రైలు ప్రమాదాలకు మానవ తప్పిదాలె ప్రధాన కారణమని మంత్రి చెబుతూ, భద్రత సిబ్బందిలో ఇరవైవేల ఖాళీలను ఈ సంవత్సరంలో భర్తీ చేయనున్నట్లు చెప్పారు. అంటే ఉండాల్సిన సిబ్బంది లేకపోవటం వల్లనే ఈ ప్రయాణాలు జరిగాయని మంత్రి ఒప్పు కొంటున్నారు. కాగా ఈ ప్రమాదాలు జరిగాయంటే రైల్వేశాఖ అలక్ష్యమే కారణమని స్పష్టమవుతుంది. ఇంతమంది మరణానికి కారకుడైన రైల్వేమంత్రిని తొలగించాలని ఎవరైనా అంటే అది తప్పు కానేరదు.

అలాగే ఈ ప్రమాదాలకు మరో కారణం ట్రాక్ సర్క్యూటింగ్, అంటే పట్టాల వెల్డింగులు విరిగిపోవడాలు లాంటివి లేకుండా చూడడం. ఈ మధ్య మన రాష్ట్రంలో ప్రమాదాలు ఈ కారణాల వల్లనే జరిగాయి. ఇప్పటివరకూ ఈ పని రైల్వేస్టేషన్ పరిధిలోనే జరుగుతూ వచ్చింది. మొత్తం రైల్వే మార్గం అంతా పరీక్షించలేదన్న మాటే. అంటే ప్రమాదాలకు కారణం ఈ వైఫల్యం కూడా ఒక కారణం. బలహీనమైన వంతెనలు, అరిగిపోయిన పట్టాలు. పట్టాలను నిర్ణీతకాలంలో మారుస్తూండటం నిరంతరాయంగా జరగాల్సిన ప్రక్రియ. ఈ పనులు కావాల్సినంత వేగంగా జరగలేదని ప్రతీ బడ్జెట్‌లో, ప్రతి ప్రమాదం జరిగినపుడు పునరుద్ఘాటించు కొంటూ రావటం జరుగుతోంది. కాని పని వేగంగా జరగటం లేదు. అలాంటప్పుడు ప్రమాదాలు జరుగుతాయి. దీనికి రైల్వే మాత్రమే బాధ్యత వహించాలి. ఉదాహరణకు రాష్ట్రంలో హాస్పేట్- గుంతకల్, గూడూరు, రేణిగుంట, గుత్తి - రేణిగుంట మీటర్‌గేజ్‌లను డబ్లింగ్ చేయటానికి అయ్యే ఖర్చు రు. 67806 లక్షలు కాగా01-02 వరకు అయిన ఖర్చు 15579 లక్షలు. నడుస్తున్న సంవత్సరంలో జరగాల్సిన ఖర్చు రు. 98.59 లక్షలు. ఈ లెక్కన ఈ ప్రాజెక్టులు పూర్తి చేయడానికి ఎన్ని దశాబ్దాలు పడుతుంది? ఇలాగే, సిగ్నలింగ్, వంతెనలు, లెవెల్ క్రాసింగ్ పనుల తాబేటి నడకగా నడుస్తున్నాయి. ఇది 02-03 నాటి పరిస్థితి. ఈ పనులను పూర్తి చేయనిదే. మనం రైల్వే ప్రమాదాల నుంచి రక్షించుకోలేం. దీనికి బాధ్యత మనం కాదు. రైల్వే యాజమాన్యమే.

**కొత్త రైళ్లు :** ఓ ఏభై కొత్త రైళ్ళను ప్రవేశపెడుతున్నట్టు ప్రకటించారు. కాని వాటికి కావాల్సిన బోగీలు, ఇంజన్లు గురించి చెప్పలేదు. చిత్తరంజన్ (కోల్‌కటా) లో రైల్వే ఇంజన్ల తయారీ కర్మాగారం, తమిళనాడులో రైల్వే బోగీలు తయారుచేసే కర్మాగారం, పంజాబ్‌లో వీల్-ఏక్సిల్ కర్మాగారం వున్నాయి. వీటిలో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలకు రు. 778 కోట్లు కేటాయించగా 01-02 నాటికి ఖర్చు చేసింది. 451 కోట్లు, 02-03 లో కేటాయించింది. రు. 74 కోట్లు. ఇంకా రు. 327 కోట్లు ఖర్చుపెట్టాల్సివుంది. ఈలోగా ఈ పథకాల అమలు కాలంలో ధరలు పెరుగుతాయి. అంచనాలు పెరుగుతాయి. కొత్త రైళ్ళు, కొత్త బోగీల సరఫరా కుంటుపడుతుంది. నడుస్తున్న సంవత్సరంలో కూడా కొన్ని కొత్త రైళ్ళను ప్రవేశపెడు తున్నట్లు ప్రకటించారు. ఇప్పటికే పాతపట్టాల మీద నడుస్తున్న రైళ్లున్నాయి. అనేక వందల కి.మీటర్ల నిడివి గల పట్టాల స్థానే కొత్తవి వేయాలన్నారు. ఈ పనులు పూర్తిగాకుండా కొత్త రైళ్ళు డజన్ల కొద్ది నడిపించటం ప్రారంభిస్తే రైల్వే ప్రమాదాలు పెరిగే అవకాశాలు ఉన్నాయి. ఈ విషయాల గురించిన తాజా పరిస్థితి గురించి రైల్వే మంత్రి వివరాలు అందజేయాల్సివుంది.

# 'జీవధార' : సంరక్షణ - సేకరణ - నిర్వహణ

-భూపతిరాజు సాంబశివరాజు

**జీవరాసుల** పుట్టుకకు, మనుగడకు అవసరమయిన 'జీవనధార' నీరు. నీరు ఉన్నచోట జీవరాసులు ఉండటం, నీరులేని చోట జీవరాసులు లేకపోవడం అనేది మనం నివసిస్తున్న ఈ భూమికి, ఇతర గ్రహాలకు ఉన్నతేడా. సర్వజీవరావులు మనుగడకే కాక ఈ జీవధార పర్యావరణ సమతౌల్యానికి, శక్తికి, భుక్తికి మౌలికమయిన పదార్థం.

ఈ భూమిమీద జనాభా పెరుగుదల వల్ల, పారిశ్రామి కీకరణవల్ల, అశాస్త్రీయ వ్యవసాయ పద్ధతులవల్లనైతే, అడవుల నరికివేతవల్లనేమి పచ్చదనం నశించిపోయి, కాలుష్యం పేరుకు పోయి వర్షాభావ పరిస్థితులు ఉష్ణోగ్రతలు పెరిగిపోయి నీటి వనరులు నాశనమయి పోతున్నాయి. జీవధార సంరక్షణ సేకరణ నిర్వహణ పూర్తిగా నిరాధారణకు గురై ఈ రోజు మానవాళికి పెను సవాలుగా పరిణమించింది.

భూమిమీద నీరు నూటికి డెబ్బైశాతం ఉన్నా ఇదంతా సముద్రపు ఉప్పునీరు కావటంమూలంగా మానవుల, జంతువుల, మొక్కల అవసరాలకి ఉపయోగపడదు. భూమి మీద ప్రవహించే నదులలోని సరస్సుల్లోని భూగర్భంలోని నీరు మాత్రమే మనం ఉపయోగించుకుంటున్నాం. ఇటువంటి నీటి వనరులన్నీ దెబ్బతిని పోతున్నాయి. కలుషితమై పోతున్నాయి. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే, ఈ వనరులను కాపాడుకుని, పెంపొందించుకుని సరిగా నిర్వహించుకునే దిశగా ఉద్యమించకపోతే ముప్పు తప్పదు.

జనాభా పెరుగుదల, పారిశ్రామికీకరణవల్లనే గాక ప్రకృతి సహజ వనరులను దుర్వినియోగ పర్చడం ద్వారా మనం నీటి ఎద్దడిని ఎదుర్కొంటున్నాం. నీరు మనకు అయాచితంగాను, చిరకాలం లభ్యమయ్యే పదార్థం అనే మతిలేని ఆలోచనవల్లనే ఈ పరిస్థితికి చేరుకున్నాం. మనం పాటిస్తున్న అశాస్త్రీయ వ్యక్తిగత నీటి వినియోగపు అలవాట్లు, వ్యవసాయ-నీటి పారుదల పద్ధతులు, పరిశ్రమల్లో ఉపయోగించే సాంకేతిక పరిజ్ఞానము ఇవన్నీ మార్చుకోవలసిన అవసరం ఎంతయినా ఉంది. అత్యంత ప్రాథమిక మౌలిక అవసరాలు, ప్రాధాన్యత గుర్తించి వాటినిమిత్తమే నీటిని పొదుపుగా వాడుకోవడమూ, విలాసమయ, ఆర్భాటపు వ్యవహారాలకు నీటిని ఇవ్వకుండా నియంత్రించడమూ తప్పదు. ఎక్కడికక్కడ వ్యక్తిగత స్థాయినుండి ప్రాంతీయ, జాతీయ స్థాయి వరకు నీటిని రిసైకిల్ చేయడం, నీటి సేకరణ, పరిరక్షణ అన్ని స్థాయిల్లోనూ ఓ ఉద్యమంగా చేబట్టి నిర్వర్తించనట్లయితే ప్రస్తుత దుర్భిక్ష పరిస్థితులనుండి బయటపడే మార్గం లేదు.

---

నడుస్తున్న సంవత్సరం "ప్రయాణీకుల సౌకర్యాల" సంవత్సరంగా పరిగణిస్తున్నామని చెప్పారు. ఏవీ ఆ సౌకర్యాలు? దేశంలో అన్ని ప్రాంతాలను కలిపే రహదారి మార్గాలను కేంద్రం నిర్మిస్తుంది. ఇది రైల్వేలకు పోటీగా పరిణమించే పరిస్థితులున్నాయి. ఇప్పటికే రైల్వేలు మోసుకెళుతున్న ఉత్పత్తులు, ప్రయాణిస్తున్న వారు రోడ్ రవాణాకు మళ్లటంవల్ల ట్రాఫిక్‌లో రైల్వేలది 90 శాతం నుండి 40 శాతానికి తగ్గిపోయింది. ఈ నేపథ్యంలో ప్రధాన రహదారులు ఏర్పాటైనపుడు ఈ ట్రాఫిక్ మరింత ఎక్కువగా రోడ్ రవాణాకు మళ్ళే అవకాశం వుంది. దాని గురించి ప్రభుత్వం ఆలోచన ఏమిటి?

ఈ మధ్య రైల్వే శాఖ ఉపమంత్రి దత్తాత్రేయ రైల్వేలలో కొన్ని కార్యక్రమాలను ప్రైవేటీకరణ చేయాలని వాదిస్తున్నారు. రేపు రైల్వేలను మొత్తంగా ప్రయివేటీకరించడానికి ఈ వాదనలు ప్రారంభ సూచికలు కావచ్చు. బ్రిటన్‌లో థాచర్ ప్రధానిగా వున్నప్పుడు రైల్వేశాఖను ప్రయివేటీకరించగా, అవి ఎంత అధ్వాన్నంగా తయారయ్యాయంటే ప్రస్తుత బ్రిటన్ ప్రధాని బ్లెయిర్ "భూలోక నరకాన్ని రుచి చూస్తున్నాం" అని వ్యాఖ్యానించాల్సి వచ్చిందంటే ప్రయివేటీకరణ గురించి వేరే వ్యాఖ్యానం అనవసరం.

రైల్వేల గురించి ప్రస్తావన వచ్చినపుడల్లా దేశంలో 63 వేల కి.మీ. నిడివిగల రైలు మార్గాలున్నాయని, చెబుతూ అదంతా తమ పరిపాలనలోనే జరిగిందనే భ్రాంతిని కలిగిస్తున్నారు. మొదటి రైల్వే లైను 1849లో ప్రారంభించిన నాటినుండి 1947 వరకూ, అంటే నూరు సంవత్సరాల్లో 54 వేల కి.మీ.ల నిడివిగల రైలుమార్గాలను నిర్మించగా, స్వతంత్ర్యం వచ్చి 55 సంవత్సరాల్లో స్వదేశి పాలకులు నిర్మించింది కేవలం తొమ్మిదివేల కి.మీ. మాత్రమే. ఇంతటి వైఫల్యం యే రంగంలోనూ లేదు. దీనికి ఒక కారణం రైల్వేలకు కేంద్ర బడ్జెట్‌లో చేసే కేటాయింపులు నానాటికీ తగ్గుతూ రావటం. ఒకటవ ప్రణాళికలో 34 శాతం నిధులను సమకూర్చిన కేంద్రం అయిదవ ప్రణాళిక నాటిని 57 శాతానికి పెంచి, ప్రస్తుతం 9వ ప్రణాళిక అంతానికి 20 శాతానికి తగ్గించారు. ఇక రైల్వేలు ఎలా బాగుపడతాయి? ❑

సామాజికంగాను, ఆర్థికంగాను అవకాశాలు అంది పుచ్చుకున్న ముఖ్యంగా మనదేశంలో ఉన్నత, మధ్యతరగతి వర్గాలకు నీటిని విచ్చలవిడిగా వాడడం, వృథా చేయడం ఓ జాడ్యంగా మారిపోయింది. సాంప్రదాయవనరులను సంరక్షించుకొని, అభివృద్ధి చేసుకుని, పోషించుకొని ప్రాంతీయ అవసరాలకు అనువుగాను, పొదుపుగాను, తెలివిగాను వాడుకోవడంలో ఇటు ప్రజలు, అటు ప్రభుత్వము విఫలమయ్యారని చెప్పక తప్పదు.

విపరీతమయిన సామాజిక - ఆర్థిక వ్యత్యాసాలున్న ఈ వర్గ సమాజంలో నీటి వినియోగం కూడా వర్గస్వభావం కల్గి ఉంటుంది. సంతరించుకుంటుంది. అట్టడుగున ఉన్న వర్గాలు ఓ చుక్కనీటికోసం ఎనలేని బాధలు, ఇక్కట్లు పడుతుంటే, ఉన్నత వర్గాలవారు, ఇతర పై ఆదాయవర్గాల ప్రజలు కేవలం ఈ నీరు తమకోసమే భగవంతుడు సృష్టించినట్లుగా భావిస్తూ విచ్చలవిడి వాడకానికి అలవాటుపడిపోయారు. ప్రభుత్వాలు కూడా ఈ వర్గం ప్రయోజనలు నెరవేర్చే, కాపాడే విధంగానే వ్యవహరిస్తున్నాయి. కేవలం దళారీ, పెట్టుబడిదారీ పంథాలోను, ఇతరేతర శక్తుల లాభాల కోసమే ప్రభుత్వాలు పనిచేస్తున్నాయి తప్ప విస్తృత ప్రజా సమూహాల కనీస అవసరాలు నెరవేర్చే దిశగా ప్రణాళికా రచన గాని, ఆలోచన గాని జరగకపోవడం మూలంగా ఈనాడు నీటి సమస్య ఏర్పడ్డానికి కారణం. ప్రభుత్వం నిజమయిన ప్రజాస్వామ్య యుత ప్రభుత్వం కాకపోతే, ప్రభుత్వంలో ఉన్నవారు, ఉద్యోగ వర్గాలు, 'ప్రజలకు సేవ చెయ్యాలి','ప్రజలకోసమే పనిచెయ్యాలి' అనే నిస్వార్ధ వాలంటరీ దృక్పథం లేకపోతే దేశ జనాభాను ఈనాటి సంరక్షణ - సేకరణ - పొదుపు - నియంత్రణ అనే మహా ఉద్యమంలో భాగస్వాముల్ని చెయ్యలేరు. దళారీవర్గ ప్రయోజనాల కనుగుణంగానే విస్తృత ప్రజా జీవనాన్ని అంధకారమయం చేసి తమ సొంత వర్గ ప్రయోజనాల కనుగుణంగానే ఇంతవరకు నీటి వినియోగాన్ని నిర్వహిస్తున్నారు. ఈ రోజు ఆ సమస్య ఓ భయంకర రూపం దాల్చి ప్రజలు తిరుగుబాటు మార్గం పడుతున్న తరుణంలో నదుల అనుసంధానమనే అవతారమెత్తుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడి 'నీరు-మీరు'కార్యక్రమం కేవలం ప్రచార పటాటోపంతో మొదలై పైకి లేవలేక పూర్తిగా చతికిలబడిపోయింది. కారణం జగద్విదితమే. జిమ్మిక్కులతో, ఆర్భాటపు నినాదాలతో బహు ప్రాథమికమయిన, మౌలికమయిన ప్రజల జీవన్మరణ సమస్య ప్రపంచబ్యాంకు పాదదాసులయిన ఏలికల డొల్ల విజన్‌లు ప్రజలకు దూరంగా కాంట్రాక్టర్లకు దగ్గరగా, కొంతమంది జేబుల నింపుడు వ్యవహారంగా మిగులుతుందే తప్ప సమస్యను పూర్తిగా పరిష్కరించలేదు. ఈ సమస్య పెనురూపం దాల్చి మరింత వైరుధ్య భరితమై చివరకు ప్రజా పరిష్కారాన్నే కోరుకుంటుంది. అటువైపుగానే పయనిస్తుంది.

భారతదేశంలో పుష్కలంగా 40 కోట్ల హెక్టార్ మీటర్ల వర్షపాతం ప్రతి సంవత్సరం నమోదౌతోంది. దేశంలో మంచి నదులు కూడా ఉన్నాయి. అయితే ఈ వనరులు దేశంలోని, విభిన్న ప్రాంతాలకు సమానంగా సమకూడిలేవు. కొన్ని ప్రాంతాలు వరద భీభత్సంతోనూ, కొన్ని ప్రాంతాలు పూర్తి వర్షాభావంతోను సతమత మౌతున్నాయి. ప్రజాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకుని ఈ అసమతౌల్యాన్ని సరిచేసే ఆలోచన హర్షించదగ్గదే అయినా ప్రభుత్వాలు దీనిని ఒక ఎలక్షన్ స్టంట్‌గా వాడుకోవడాన్ని ప్రజలు అర్థం చేసుకోవాలి.

ఇప్పుడు ఈనాటి సమస్య ఒక సామాజిక అంశంగానే కాక రాజకీయ అంశంగా కూడా మారింది. అన్ని పార్లమెంటరీ ఓట్ల రాజకీయ పార్టీలు రాబోయే ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని ప్రజలను ఓట్లు అడుక్కోవడానికి, వారి ప్రశ్నలను ఎదుర్కోవడానికి "నదుల అనుసంధానం" మంత్రం జపం మొదలుపెట్టారు. ఈ జపాన్ని మరింత హెచ్చుస్థాయిలో ఇక అన్నిరకాల ప్రచార సాధనాల ద్వారా ముందుముందు హోరెత్తిస్తారు. నదుల అనుసంధాన సాధ్యాసాధ్యాలను ప్రజాపక్షంగా చర్చించి, సమీక్షించాల్సిన అవసరం ఎంతయినా ఉంది. ఈ ప్రణాళికలో ఉన్న అన్ని కోణాలను, మంచి - చెడులను, వ్యయ - ప్రయాసలను, పర్యావరణ సమస్యలను అర్థం చేసుకుని ఓ నిర్ణయానికి రావాలి తప్ప దాసోహమంటున్న పాలకుల మాటలు నమ్మడం సరైనది కాదు.

మనకు ఇప్పటికే ఏర్పడి ఉన్న సకల సాంప్రదాయ నీటి వనరులను గ్రామసీమలనుండి పట్టణాలవరకు సంరక్షించుకోవడం, వర్షపు నీటిని వృథా కాకుండా ఉపయోగం తేకపోవడం ప్రతి ప్రాంతంలో అక్కడి ప్రజల భాగస్వామ్యంతో నీటి సంరక్షణ - సేకరణ - నిర్వహణ కార్యక్రమాన్ని రూపుదిద్దటం ముందుగా చెప్పవలసింది. దీర్ఘకాలిక ప్రణాళికలు సమాంతరంగా రూపుదాల్చాలి. ఇది ఒక సామూహిక, సామాజిక ఆలోచనాత్మక సంఘీభావ సందర్భం దిశగానే ఈ సమస్యపై చర్చ - ప్రణాళిక - ఆచరణ రూపుదిద్దుకోవాలి. ❐

---

ఆంధ్రప్రదేశ్ ఖజానాకు 2003-04 లో మొత్తం ఆదాయం రు. 27,964 కోట్లు అయితే అందులో కేంద్రం నుంచి వచ్చేది రు. 9,795 కోట్లు. అంటే ప్రతి మూడు రూపాయల్లో ఒక రూపాయ కేంద్రాన్నుంచే వస్తుంది. మిగతా రెండు రూపాయల్లో మార్కెట్ రుణాలు, విదేశీ రుణాలు వగైరాలు కూడా గమనంలోకి తీసుకుంటే రాష్ట్రం ఖర్చుచేసేది సుమారుగా ఒక రూపాయ మాత్రమే వుంటుంది.

అలాగే మొత్తం ఖర్చులో ప్రణాళిక ఖర్చు నాలుగోవంతు అంటే ప్రతిరూపాయ ఖర్చులో ఒక రూపాయే అభివృద్ధికి ఖర్చు. కాని అది పైకి కనపడే చిత్రం మాత్రమే. ప్రణాళిక ఖర్చు, ప్రణాళికేతర ఖర్చు అంటే జీతభత్యాలు వగైరాలు వుంటాయి. అది కూడా మినహాయిస్తే నిజంగా అభివృద్ధికి అయ్యే ఖర్చు ఎంతో ఆర్థిక మంత్రి చెబితే బావుంటుంది.

# ఫలించని రాష్ట్ర బడ్జెట్ విన్యాసాలు

-వి. హనుమంతరావు

**బడ్జెట్** ఉపన్యాసం వింటే రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని ఒక విహంగ వీక్షణం చేసినట్లు ఉండాలి. వివిధ రంగాల్లో ఎక్కడ వున్నాం. వచ్చే సంవత్సరంలో లేదా సంవత్సరాల్లో ఎక్కడికి వెళ్తున్నాం అనేది తెలియాలి. బడ్జెట్ సమావేశంలో సాధారణ చర్చ ముగిసిన తర్వాత, ప్రతీ ప్రభుత్వశాఖ డిమాండు చర్చకు రావటం, ఆ శాఖకు సంబంధించిన వివిధ విషయాలను ప్రభుత్వం సభ ముందు వుంచడం, చర్చ జరగటం - ఇదీ పద్ధతి. కాని గత కొన్ని సంవత్సరాలుగా ఏ రెండు, మూడు శాఖల డిమాండ్లుతప్ప, మిగతావన్నీ చర్చలేకుండానే గిలెటిన్ అయిపోతూండడంతో, ఆయా శాఖల్లో పరిణామాల గురించి ప్రజలకు తెలుసుకొనే అవకాశం గాని, ప్రజా ప్రతినిధులకు చర్చించే అవకాశం గాని లభించటం లేదు. ఈ ప్రత్యేక పరిస్థితి నేపథ్యంలో ఆర్థికమంత్రి బడ్జెట్ ప్రవేశపెడుతూ చేసే ప్రసంగం అన్ని మంత్రిత్వశాఖల విశేషాలను తెలియపరిచే ప్రసంగంగా వుండాలి. కాని బడ్జెట్‌లో కొత్త పుంతలు తొక్కుతున్న రాష్ట్ర ప్రభుత్వం ఈ సంవత్సరం మరో కొత్త పుంతతొక్కి ఇప్పటి వరకూ వుంటూ వచ్చిన పారదర్శకతను కూడా కుదించేసింది. బడ్జెట్ ఉపన్యాసాన్ని కేవలం ద్రవ్యసంబంధిత విషయాలకు పరిమితం చేసింది. వివిధ శాఖల్లో జరుగుతున్న కార్యక్రమాలను లాంఛనంగా మాత్రమే ప్రస్తావించింది. ద్రవ్యసంబంధిత విషయాలను సభకు తెలియజేయడం అవసరమే. అయితే అది ద్రవ్యసంబంధిత విషయాలను అర్థం చేసుకోగలిగిన వారికే పరిమితమవుతుంది. విశాల ప్రజానీకానికి అది బ్రహ్మపదార్థంగానే వుండి పోతుంది. ప్రజల మాట అలావుంచి, శాసనసభ్యులకు ఎంతమేరకు అర్థమవుతోంది అనేది ప్రశ్నార్థకమే.

గత మూడు సంవత్సరాలుగా రాష్ట్ర ప్రభుత్వం బడ్జెట్‌లో రకరకాల ప్రయోగాలు చేస్తూ వచ్చింది. శూన్యాధారిత బడ్జెట్, ఆరునెలల బడ్జెట్ నిధులను ముందే విడుదల, ముసాయిదా బడ్జెట్‌ను ముందస్తుగా ప్రకటించి చర్చకు పెట్టడం - వీటిలో ఏ ఒక్క ప్రయోగమైనా అనుకొన్న ఫలితాలను సాధించలేదన్నది స్పష్టం. ముందస్తుగానే బడ్జెట్‌ను విడుదల చేసే ప్రక్రియను కేంద్రంలో, అన్ని రాష్ట్రాల్లో ప్రవేశపెట్టాలని ముఖ్యమంత్రి కేంద్రానికి సలహా ఇచ్చారు. తామునిగినది గంగ, తావలచినది రంభ అన్నట్లుగా ముఖ్యమంత్రికి తాను ప్రవేశపెట్టిన పద్ధతి విప్లవకరమైనదిగా భావించటం సహజం. పన్నులు, డ్యూటీలు, ఛార్జీల్లో మార్పులు ఉంటాయి కాబట్టి ఆ మార్పులు మార్కెట్‌ను ప్రభావితం చేసి, వ్యాపార సంస్థలు అక్రమంగా లాభాలార్జించుకొంటాయనే బడ్జెట్ ప్రతిపాదనలను బడ్జెట్‌ను రహస్యంగా వుంచటం, బడ్జెట్‌ను మార్కెట్లు మూసివేసిన తర్వాత సాయంత్రం అయిదు గంటలకే ప్రవేశపెట్టడం జరుగుతూంది. మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు బడ్జెట్‌లో పన్నులు ప్రకటించే ఆనవాయితీ లేదు. (అయినా పన్నుల్లేని బడ్జెట్ అని పత్రికలు ఎందుకు రాస్తాయో తెలియదు) అలాంటపుడు మన బడ్జెట్ ముందస్తుగా ప్రచురించటంలో వచ్చే నష్టమేమీ లేదు. నిజానికి ఈ సంస్కరణను ముఖ్యమంత్రి ఎప్పుడో ప్రవేశపెట్టి వుండాల్సింది. నష్టంలేకపోగా లాభం కూడా, ప్రజలు సలహాలు, సూచనలు చేయవచ్చు. ఆర్థిక సమస్యల గురించి వారి అవగాహన పెరగడానికి, ప్రభుత్వ నిర్ణయాలను సరిగా విశ్లేషించుకోవడానికి తోడ్పడుతుంది. కాని రాష్ట్రంతో పోలిస్తే, కేంద్రం ద్రవ్యపరిస్థితి సంవత్సరం పొడవునా తెరిచిన పుస్తకం. ప్రతినెలా ఆదాయం, ఖర్చు వివరాలు ప్రచురితమవుతాయి. ద్రవ్యోల్బణం లెక్కలు ప్రతివారం తెలుస్తుంటాయి. కొన్ని ప్రభుత్వ శాఖల మాసిక నివేదికలు వెలువడుతుంటాయి. ద్రవ్యధోరణులెలా వున్నాయో, రిజర్వుబ్యాంకు ప్రతివారం ప్రతినెలా విడుదల చేస్తూ వుంటుంది. సి.ఎం.ఐ. యిలాంటి అనేక ఆర్థిక విషయాల పరిశోధనాసంస్థలు కేంద్రప్రభుత్వ గణాంకాల విశ్లేషణలు వెలువరిస్తుంటాయి. వివిధ మంత్రిత్వ శాఖల మాసపత్రికలు ప్రచురింపబడుతున్నాయి. ఈ సంవత్సరం అక్టోబరులో అర్థసంవత్సరం సమీక్ష వెలువడింది అటువంటి కేంద్రానికి ముఖ్యమంత్రి సలహా అవసరం లేదను కొంటా. ఇటువంటి సలహా ఇవ్వడానికి అసలు కారణం రాష్ట్ర ప్రభుత్వంలో పారదర్శకత లేకపోవడం, ముందస్తుగా బడ్జెట్ ప్రవేశపెట్టినంత మాత్రాన అది పారదర్శకత అయిపోదు. ప్రతి సంవత్సరానికి ఒక్కసారే రాష్ట్ర ద్రవ్యపరిస్థితుల కవాటాలు తెరుచు కుంటాయి. లేకపోతే బంద్. సంవత్సరం పొడవునా అపుడపుడు ఆర్థిక శాఖమంత్రి నోరు విప్పితే తప్ప ద్రవ్యపరిస్థితి అంతఃపుర రహస్యమే. చొరవ చూపించే పాత్రికేయులు తవ్వి బయటకు తీస్తే తప్ప, అందుకు సంబంధించిన వార్తలేవుండవు. ప్రణాళికా శాఖ కార్యదర్శి (ఇదివరకు) దర్శనం పాత్రికేయులకు సాధారణంగా లభించదు. ఆ మధ్య ఆయనతోటి కార్యదర్శులకే జవాబు లభించలేదు. ఇదివరకు గణాంకశాఖ త్రైమాసిక బులెటిన్‌లో ప్రణాళిక ఖర్చు వివరాలు ప్రచురింపబడుతుండేవి. ఇది బంద్

అయిపోయింది. స్వయంగా నేటి ముఖ్యమంత్రి ఆర్థిక శాఖ మంత్రిగా వున్నప్పుడు ప్రతినెలా ఆదాయ వ్యయ వివరాలు తెలియజేస్తానని ప్రకటించి ఒక్కనెల మాత్రం ఇచ్చి, తర్వాత మానేశారు. ప్రభుత్వ పాప్యులరిస్టు పథకాలకు మాత్రం కావల్సినంత పారదర్శకత. అలాంటి ప్రభుత్వానికి ముందస్తుగా బడ్జెట్ విడుదల చేయడమే ఒక విప్లవంగా అనిపించడం సహజం. ఈ నేపథ్యంలో బడ్జెట్ కేవలం ద్రవ్య పరిస్థితుల వివరణకే పరిమితం కావటంతో, రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని క్లుప్తంగానైనా తెలుసుకోకుండా తెరదించేసి నట్లయింది. మూడు వేల పేజీల బడ్జెట్ పత్రాలు తిరిగేస్తే, ఏం జరుగుతోందో తెలియదు. ఇది ఎంతమందికి సాధ్యం?

పోనీ ఇచ్చిన సమాచారాన్నయినా ఒక పద్ధతిలో సమగ్రంగా ఇస్తున్నారా అంటే అది ప్రశ్నార్థకమే. ఉదాహరణకు ఆర్థిక సర్వే పత్రం గత నాలుగైదు సంవత్సరాల క్రితం పరిస్థితిలో పోల్చి చూసుకుంటే చాలా మెరుగైందనేది వాస్తవం. అందుకు ఆర్థిక గణాంకశాఖను, ఈపత్రాన్నితయారుచేసే ప్రణాళికా శాఖ విభాగాన్ని అభినందించాలి. అయితే, గణాంకాలను అందజేయటంలో పాలకుల అభిష్టాల మేరకు చీర సింగారించి అందచేస్తుంది. ఒకచోట 92-93 నుంచి, మరో చోటికి 93-94 నుంచి, ఇంకోచోట 98-99 నుంచి, కొన్ని గ్రాఫ్‌లు 90-91నుంచి రకరకాల బేస్ ఇయర్స్ తీసుకుని గణాంకాలు ఇవ్వటంలో పాలక పార్టీ ప్రయోజనాలు నెరవేరుతాయో, లేదో కాని గణాంకాలను అధ్యయనం చేసి, విశ్లేషించదలచుకొన్నవారికి, ప్రజలకు తప్పుడు సంకేతాలిస్తాయి. తాజా, సంపూర్ణ సమాచారం అందక పోవటమే మరో విషయం. ఉదాహరణకు 2003లో అడుగు పెట్టిన మనకు తలసరి విద్య ఖర్చు 93-94 నుంచి 97-98 వరకు ఇచ్చారు. అదే విద్య పద్దు కింద వెనుకబడిన తరగతుల విద్యార్థుల హస్టళ్లలో ఫలితాల శాతాలు, 97 నుంచి 01వరకూ ఇచ్చారు. సాంఘిక సంక్షేమ హాస్టళ్ళలో ఫలితాల వివరాలు 1996 నుంచి ఇచ్చారు. ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలుగా ఇవ్వవచ్చు. నేటి రాజకీయార్థిక వ్యవస్థలో రాజకీయావసరాలకనుగుణంగా గణాంకాలను మెలి తిప్పటంలో ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. బ్రహ్మానంద రెడ్డి ఆర్థిక మంత్రిగా వున్నప్పుడు రాష్ట్రంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి గురించి ఆర్థిక గణాంకశాఖ పత్రికలకిచ్చినందుకు ఆయన మందిలింపులను అందుకోవాల్సి వచ్చింది. పంట తగ్గిందని చూపించి కేంద్రంనుంచి అదనపు నిధులను రాబట్టే ప్రయత్నంలో వుండడం బాగానే పండిందని చెప్పటం ఆయనను ఇరకాటంలో పెట్టింది. అలానే ఇప్పుడు జన్మభూమికి సంబంధించి కింది అధికారులు అందజేసే గణాంకాలు ఎంత వాస్తవమైనవో ఎవరికి తెలియదు? అయినా ఒక ప్రత్యామ్నయ సోర్స్ లేనపుడు ప్రభుత్వ గణాంకాలే ఆధారం. అయితే శాసన సభ్యులు తమ నియోజక వర్గాల్లో స్వీయాను భవాలను సభలో వివరిస్తే, వాటి వెలుగులో ప్రభుత్వ గణాంకాలను విశ్లేషించుకోవచ్చు.

బడ్జెట్ పత్రాలంటే కేవలం ఆదాయ, వ్యయాల పట్టిక మాత్రమే అనేవారున్నారు. కాదు, ప్రభుత్వ విధానాలను చేసిన కేటాయింపులనుబట్టి అర్థం చేసుకోవచ్చుననేది మరో వాదన. ప్రస్తుత కరువు పరిస్థితులవల్ల వ్యవసాయం, నీటి పారుదల పథకాలకు కేటాయింపులను పెంచే విధాన నిర్ణయం తీసుకున్నా మని ఆర్థిక మంత్రి చెప్పటం కించిత్ ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది. కేవలం కేటాయింపులు పెంచటమే విధాన నిర్ణయం కానేరదు. సామాజిక సేవలకో మరే ఇతర కార్యక్రమానికో ప్రథమ ప్రాధాన్యత ఇస్తున్నా మంటే అది ఒక విధాన ప్రకటన అనవచ్చు. జీరో బడ్జెట్ ప్రవేశపెట్టడం విధాన ప్రకటన. ఇకనుంచి రుణాలు తీసుకోబోమని చెప్పటం విధాన ప్రకటన అవుతుంది.

రుణాలంటే గుర్తుకు వచ్చింది. మన రాజ్యాంగంకు ఇంతకు మించి రుణం చెయ్యాకూడదని పార్లమెంటు, రాష్ట్ర శాసన సభలకు చట్టాలు చేసే హక్కు కల్పించింది. అలాంటి ఫిస్కల్ రెస్పాన్సిబిలిటీ చట్టాన్ని తీసుకొని రావడానికి వి.పి.సింగ్ ప్రభుత్వం విఫలప్రయత్నం చేసింది. అప్పుల నుంచి వచ్చే అనర్థాల గురించి రోజా పత్రికల్లో చదువుతూనే వున్నాం. నిల్చొంటే రుణం, కూర్చొంటే రుణం కోసం పరుగులు తీసే మన రాష్ట్రప్రభుత్వాన్ని చూచినపుడు అలాంటి చట్టం రాష్ట్రంలో చేస్తే బావుంటుందనిపిస్తుంది. రాష్ట్రంలో వున్న శాసన సభ్యులందరినీ విహారయాత్రలకు పంపి కోట్ల రూపాయలు వృథా చేసే బదులు, పైన ఉదహరించిన చట్టాన్ని అమలుపరుస్తున్న న్యూజిలాండ్‌కు ప్రతిపక్షాల నాయకులు, ఆర్థికమంత్రి వెళ్లి అధ్యయనం చేసి, అలాంటి చట్టం ప్రవేశపెడితే, అలాంటి చట్టాన్ని మొట్టమొదటగా ప్రవేశపెట్టిన ఘనకీర్తి చంద్రబాబుకు దక్కుతుంది. ఇంతకన్నా ఎక్కువ రుణం చేయకూడదు, ఇంతకన్నా ద్రవ్యలోటు మించకూడదు అని ఒక చట్టాన్ని ప్రవేశపెట్టవచ్చు. అమెరికాలో కూడా ఇలాంటి చట్టం వుంది. ఆ రెండు దేశాలు కొన్ని చేదు అనుభవాలనెదుర్కొన్నాయి. ఆచరణలో చాలా సమస్యలు తలెత్తు తాయి. ఆ అనుభవాన్నుంచి మనం పాఠాలు నేర్చుకోవచ్చు. అలా చట్టం తీసుకుని వస్తే అదొకవిధాన నిర్ణయమవుతుంది. అప్పులు చేయడమే అభివృద్ధికి సోపానమని గట్టిగా విశ్వసించే ముఖ్యమంత్రి తన ఆలోచనను పునరాలోచించుకోవాలి. చిల్లర మల్లర గిమ్మిక్కు లను పక్కకునెట్టి, ఇలాంట ప్రాథమిక విధాన నిర్ణయంచేసి దేశానికే మార్గదర్శకం కావచ్చు. ❐

విద్యావిధానంలో శాస్త్రవిజ్ఞానంతో పాటు జ్యోతిశ్శాస్త్రం కూడా పాఠ్యాంశంగా చేయటంలో గల ఔచిత్యాన్ని ప్రముఖ శాస్త్రవేత్త, రాజ్యసభ సభ్యులు రాజారామన్న ప్రశ్నించారు. కర్మ సిద్ధాంతం మొత్తంగా అర్థరహితమని ఆయన అన్నారు. పూర్వజన్మ ఉందోలేదో చెప్పలేని పరిస్థితిలో ఆ జన్మలో చేసిన పాపాలకు ఈ జన్మలో ఫలితం అనుభవించడం అనేది నాకు అర్థంకాని విషయం అని ఆయన అన్నారు.

- దక్కన్ క్రానికల్, ఫిబ్రవరి 23, 03.

# సభా సంప్రదాయాలకు చెల్లుచీటి

-వి. హనుమంత రావు

**పార్లమెంటరీ** సాంప్రదాయాలు, విధానాల గురించి పాలకులు మాట్లాడడం, చూస్తే దెయ్యాలు వేదాలు వల్లిస్తున్నా యన్న నానుడి గుర్తుకువస్తుంది. మొన్న ఫిబ్రవరి 24 న శాసనసభలో విద్యుత్‌కేంద్రాలు ప్రయివేటీకరణ చర్చకు వస్తే ఆ విషయంలో ప్రభుత్వం తన విధానాలను సమర్థించుకోలేక ప్రతిపక్ష నాయకుడు రాజశేఖర రెడ్డి కొడుకు విద్యుత్ కేంద్రాల స్థాపనలో అవలంబించిన పద్ధతులమీద తమ చర్చను మళ్ళించి, అరడజను మంత్రులు, దేశం సభ్యులు సభాకాలాన్ని ఎలా వృధా చేసారో, ఎంత గొడవ జరిగిందో ముఖ్యమంత్రి సభలో వుండగానే ఇదంతా ఎలా జరిగిందో, పానెల్ స్పీకర్ ఎలా ప్రవర్తించారో చూచిన తర్వాత పార్లమెంటరీ సాంప్రదాయాలను ఎవరు మంటగలిపారో, సభను సాఫీగా సాగకుండా ఎవరు అడ్డు కొంటున్నారో స్పష్టమైంది. నేడు అధికార పక్షంలో, ప్రతిపక్షంలో వున్నవారు ఒకప్పుడు పాలించినవారే, ప్రతిపక్షంలో కూడా కూర్చున్న వారే. ఉభయ పార్టీలు ప్రతిపక్షంలో వున్నప్పుడు ఎంత మర్యాదగా హుందాగా ప్రవర్తించారో, నియమ నిబంధనలను ఎంతగా పాటించారో అందరూ గమనించిన విషయమే. గురువిందగింజ తన కింద నలుపు తానెరుగదట. ఇద్దరూ సంయమనం ఎలా చూపించాలో ఆచరణలో చూపించిన దాఖలాలు లేవు. అలాంట ప్పుడు సభ మర్యాదల గురించి నీతులు చెప్పే హక్కు ఇద్దరికీ లేదనే చెప్పాలి.

ఇందుకు ప్రతిరోజూ ఇలా నోరు పారేసుకోవడం, తిట్టుకోవడం, అరవడం, నినాదాలివ్వడం, వెల్‌లోకి దూసుకపోవడం ఎందుకు జరుగుతుంది? ఇక్కడ శాసనసభ పాత్ర కార్యనిర్వహణ గురించి తెలుసుకోవడం అవసరం. ప్రజలందరు ఎన్నుకొన్న సభ్యులు సభలో కూర్చుంటారు. కాబట్టి వారు ప్రజాభిప్రాయానికి, వారి వారి నియోజకవర్గాల్లో పరిస్థితులకు అద్దంపట్టాలి. ప్రజల సమస్యలను, ఇబ్బందులను సభలో వినిపించి పాలక పార్టీనుంచి పరిష్కారం కోసం ప్రయత్నించడం సహజం, ప్రయత్నించాలి కూడా. సభలో మంత్రులు మాట్లాడేటప్పుడు, ప్రధానంగా పైనుంచి కిందివరకూ ఉన్న అధికార యంత్రాంగం ఇచ్చే సమాచారం మీద ఆధారపడి మాట్లాడడం, జవాబివ్వడం జరుగుతుంది. ఈ అధికార యంత్రాంగం ఎంత బాధ్యతారహితంగా ప్రవర్తిస్తుందో స్వయానా ముఖ్యమంత్రి చంద్రబాబే తన అసంతృప్తిని తరచుగా సభలో, బయటా, టెలికాన్ఫరెన్స్‌ల్లో వెలిబుచ్చడాన్ని మనం చూస్తున్నాం. అలాంటి అధికారగణం అందచేసే సమాచారం మీద అధారపడి నపుడు మంత్రుల జవాబులు, ఉపన్యాసాలు వాస్తవానికి ఎంతదూరంగా వుంటాయో ఊహించవచ్చు. అలాగే ప్రభుత్వ విధానాల ఫలితంగా ఏర్పడిన పరిస్థితులను, లొసుగులను అధికార పార్టీ దాచిపెట్టడం, తన యంత్రాంగాన్ని సమర్థించుకోవడం ఇపుడు చూస్తున్నాం. కాంగ్రెస్ పాలించినపుడూ చూచాం. ప్రకటనలు, ఉపన్యాసాలు వాస్తవ పరిస్తితులను దాచిపెడతాయి. కాబట్టి వాటిని సభలో ప్రతిబింబించడం సభ్యులందరి బాధ్యత. ముఖ్యంగా ప్రతిపక్షానిది మరింత బాధ్యత. ప్రభుత్వ వైఫల్యాలు ఎంత ఎక్కువగా, ఎంత లోతుగా వుంటే, మంత్రులు అంతే గట్టిగా తమను, తమ ప్రభుత్వాన్ని, అధికారగణాన్ని సమర్థించుకోవడానికి ప్రయత్నించినపుడు, ప్రతిపక్షం కూడా అంతే గట్టిగా, వారికున్న సమాచారం ఆధారంగా అసలు వాస్తవాన్ని బయటకు లాగడానికి ప్రయత్నిస్తుంది. ఈ ప్రయత్నంలో అపుడపుడు హద్దులుమీరి ప్రవర్తించడం జరిగిందంటే, సంయమనం పాటించని విధంగా విన్యాసాలు చేస్తూ తమ ఆగ్రహాన్ని ప్రదర్శిస్తున్నాయంటే, దానికి అసలు కారణం మంత్రులు ఆ విషయంలో పారదర్శకతను ప్రదర్శించకపోవడమే. సభ నియమ నిబంధనలు పాటించకపోవడం మంచి పద్ధతి కాదు. కాని అలా పాటించకపోవడానికి కారణం ప్రతిపక్షం దుందుడుకుతనమో, బాధ్యతారాహిత్యమో, మొండి తనమో కానేరదు. తమ మెజారిటీ అస్త్రాన్నుపయోగించి, వాస్తవాల ను, తమ విధానాల వైఫల్యాన్ని బయటపడకుండా కాపాడుకోవా లనీ, స్వీయరక్షణ చేసుకోవాలని మంత్రులు చేసే ప్రయత్నమే అసలు కారణం.

ఇక్కడే స్పీకర్ పాత్ర చర్చకు వస్తుంది. స్పీకర్ నిష్పక్షపాతంగా ఉండటమేగాక, ఉంటున్నట్లు కనిపించడం కూడా అవసరం. చాకచక్యం, సమయస్ఫూర్తి ప్రయోగించాలి. చాలా తరచుగా ప్రతిపక్ష సభ్యులు వాయిదా తీర్మానాలను ప్రతిపాదిస్తుంటారు. ఆ తీర్మానాలు ఆరోజునో, అంతకు ముందురోజునో జరిగిన విషయాల గురించే సాధారణంగా వుంటాయి. కాని స్పీకర్ సుమారుగా ప్రతి వాయిదా తీర్మానాన్ని నిరాకరించడం జరుగుతోంది. ఈ లెక్కన నియమ నిబంధనల్లో సభ్యులకు వాయిదా తీర్మానం ప్రతిపాదించే హక్కు ఉంది అనే క్లాజు ఉండడం ఎందుకు? ఓ సెషన్‌లో పది వాయిదా తీర్మానాలను ప్రవేశపెట్టారనుకొంటే వాటిలో నిజంగా వాయిదావేయాల్సిన అవసరం ఉన్న సందర్భాలు స్పీకర్ దృష్టిలో ఒకటి రెండు కూడా వుండవా? మీరు వేరే రూల్ కింద రండి చర్చకు అనుమతిస్తానని స్పీకర్ అంటుంటారు. అంటే ఆ విషయం సభలో చర్చించాల్సిన అవసరం ఉందని స్పీకర్ కూడా అంగీకరిస్తున్నారన్న మాట. కాని వాయిదా తీర్మానం కింద మాత్రం కాదు. వాయిదా తీర్మానం ప్రవేవపెట్టడం చాలు, నిరాకరించడం

అనే రూళ్ళకర్ర సిద్ధాంతం స్పీకర్ అమలు పరుస్తున్నారని స్పష్టమయిపోయింది. అందుకే గొడవ, గోల. ప్రతిపక్షం రాజకీయ ప్రయోజనాలకోసం కొన్ని వాయిదా తీర్మానాలను ప్రవేశపెట్టిందే అనుకొందాం. ఏం, రాజకీయాలు నిషిద్ధమా? రాజకీయం చేయకుండా ప్రభుత్వపక్షం ఏమైనా మడికట్టుకొని కూర్చుందా? ఎన్నికలనుంచి శాసనసభ వరకూ అంతా రాజకీయమే కదా. స్వర్గీయ నీలం సంజీవరెడ్డి కాబోలు లోక్‌సభ స్పీకర్‌గా ఎన్నికైన వెంటనే పార్టీకి రాజీనామా ఇచ్చి ఇండిపెండెంట్‌గా స్పీకర్ కుర్చీలో కూర్చున్నారు. ఇదెంతైనా ఆదర్శనీయం. స్పీకర్‌గా ఒక మహిళ ఎన్నిక కావడం మన శాసన సభ చరిత్రలో అపూర్వం. ఆమె సభాధ్యక్ష పదవికి కొత్త వొరవడులు సృష్టిస్తారని ఆశించాలి.

అయితే ప్రతిపక్షం కూడా ఒక విషయం గమనించాలి. పత్రికల్లో, టీవిల్లో బయటకు కనబడేది వారి ప్రదర్శనలే. గ్రామాల్లో కొంతమంది స్త్రీలు, ఏ నూతిదగ్గరో, నీళ్ళపంపు దగ్గరో సమకూడినపుడు. నేను ముందు వచ్చానంటే నేను ముందువచ్చానంటూ ఇక్కడ రాయడానికి వీలులేని భాషలో ఎలా కొట్లాడుకుంటారో, అలా శాసనసభలో కొట్లాడుకొంటారని ఒక వయస్సు మళ్ళీన స్త్రీ వ్యాఖ్యానించడం, పత్రికలు చదివేవారికి, టివి చేసేవారికి కంటికి కనబడేది బలప్రదర్శనే. ఈ ప్రదర్శనకు కారణమైన మంత్రుల ప్రవర్తన వారి కంటికి కపబడదు. అందుచేత సామాన్య ప్రేక్షకులూ, పాఠకులు ఏమీటీ ప్రతిపక్షం రోజూ ఏదో ఒక యాగీ చేస్తుందని వారికి అనిపించడం సహజం. అటువంటి పరిస్థితిలో స్పీకర్ పక్షపాతంగా ప్రవర్తించిన పక్షంలో ప్రతిపక్షం బయట మరింతగా విమర్శలకు గురవుతుంది. కొన్ని సందర్భాల్లో వాకౌట్ చేయాల్సినంత అవసరమున్నా, ఆ నిముషంలో వాగ్యుద్ధాల్లో, వాడి వేడి చర్చల్లో మాటామాటా అనుకోవడం, ప్రభుత్వం ఒక మెట్టయినా దిగివచ్చి అంగీకరించకపోవడం జరిగినపుడు వాకౌట్ చేయాల్సిన అవసరం కన్పించినా, మరీ ఎక్కువసార్లు వాకౌట్లు చేస్తే, దాని విలువ, దాని పర్పస్ పోతుంది. ఆచి, తూచి ఆలోచించాల్సిన బాధ్యత ప్రతిపక్ష నాయకునిపై ఉంటుంది. నిండా మునిగినవానికి చలేమిటన్న పద్ధతిలో ప్రభుత్వ పార్టీ ప్రవర్తించవచ్చు. కాని సభలో స్పీకర్‌కు, ప్రతిపక్ష నాయకునికి ఇది కత్తిమీద సాములాంటి పరిస్థితి.

అసలు పార్లమెంటరీ సాంప్రదాయం, పద్ధతులు, విధానాలు అంటే సభలో సభ్యులు, వారి ప్రవర్తన, అందుకు సంబంధించిన నియమావళి మాత్రమే కాదు. శాసనసభ అనేక కమిటీలు, సబ్ కమిటీలు, అపుడపుడు తాత్కాలిక విచారణ సంఘాలు, హౌస్ కమిటీలు, పబ్లిక్ అకౌంట్స్ కమిటి, అంచనాల కమిటి, పిటీషన్స్ కమిటీ ఇలా అనేక సంస్థలున్నాయి. ఇవి పనిచేసే తీరు తెన్నులు కూడా పార్లమెంటరీ ప్రవర్తనా పరిధిలోకి వస్తాయి. వీటిపట్ల బాధ్యతా రహితంగా ప్రవర్తించటమంటే అది శాసన సభ పట్ల బాధ్యతా రహితంగా ప్రవర్తించడమే అవుతుంది. ప్రభుత్వ యంత్రాంగం ఈ సభను ఎంత చులకనగా చూస్తుందో మచ్చుకు కొన్ని ఉదాహరణలు ప్రభుత్వ జమా ఖర్చులను ఆడిట్ చేసి కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ప్రతి సంవత్సరం ఒక రిపోర్టును (కాగ్ నివేదిక) ప్రభుత్వానికి పంపగా దానిని ప్రభుత్వం శాసన సభముందుంచుతుంది. వివిధ శాఖల పనితీరును, దానివల్ల ప్రభుత్వం పొందిన నష్టాలను ఆ నివేదిక కుండ బద్దలు కొట్టినట్లు చెబుతుంది. ఆడిట్ అభ్యంతరాలకు ఆయా శాఖలు జవాబివ్వటం, వాటిని శాసనసభ సభ్యులకు అందజేయడం జరుగుతుంది. 1994-95, 1995-96, 1996-97 సంవత్సరాల్లో నివేదికల్లో ఆడిట్ ఎత్తి చూపిన లోటుపాట్లను 2001 సంవత్సరంలో కొన్ని శాఖలు జవాబిచ్చాయి. అంటే జవాబివ్వడానికి ఐదు నుంచి ఏడు సంవత్సరాలు పట్టిందన్నమాట. పార్లమెంటరీ సాంప్రదాయాలను గౌరవించే పద్ధతి ఇది కాదు. శాసనసభ బడ్జెట్‌ను చర్చించి ఆ ప్రకారం ఖర్చు చేయటానికి ప్రభుత్వానికి అధికారాన్ని ఇస్తుంది. కాని కొన్ని సందర్భాల్లో అనుమతించిన మొత్తం కన్నా కొన్ని పద్దులకింద ఎక్కువ ఖర్చు చేస్తుంది. 1990-91లో అలా ఎక్కువ చేసిన ఖర్చుకు ఆమోదముద్ర వేయమని 27.3.2001న అంటే 10 సంవత్సరాల తర్వాత సభముందుంచింది. ఇది పార్లమెంటరీ పద్ధతులను గౌరవించటమా? ❑

## ముప్పై సంవత్సరాల కింది మాట!

1948 ఏప్రియల్ 6న విదేశీ పెట్టుబడిదారుల భయాలను, సందేహాలను తొలగించడానికి భారత ప్రభుత్వం ఆర్థిక విధానంపై తాను ఆమోదించిన తీర్మానాన్ని ప్రకటించింది. ఆయుధసామగ్రి, రైల్వేలు, విద్యుచ్ఛక్తి, అణుశక్తి తప్ప "మిగిలిన పారిశ్రామిక రంగమంతటా సాధారణంగా ప్రైవేటు పెట్టుబడికి అవకాశం ఉంటుంది" అని ఆ తీర్మానం పేర్కొన్నది. అంటే అప్పటికున్న సామ్రాజ్యవాద ఫైనాన్సు పెట్టుబడితో సహా, గుత్త సంస్థలకు, తన అనుకూలతను ప్రభుత్వం వ్యక్తం చేసింది. సామ్రాజ్యవాద పెట్టుబడి వర్గాలలో ఇంకా ఏ మూలనైనా మిగిలివున్న భయసందేహాలను పూర్తిగా పోగొట్టడానికి, ప్రభుత్వపు ఆర్థిక తీర్మానంతోపాటుగా ప్రచురించబడిన వివరణ పత్రంలో ప్రభుత్వం మరింత స్పష్టంగా ఇలా చెప్పింది.

"భారత పారిశ్రామిక రంగంలోని విదేశీపెట్టుబడికీ, పరిశ్రమలకూ సంపూర్ణమైన స్వేచ్ఛను ఇవ్వాలనీ, అదే సమయంలో జాతీయ ప్రయోజనాలరీత్యా అది క్రమబద్ధం చేయబడేలా చూడాలనీ ఈ తీర్మానం చెప్తుంది. పరిశ్రమల నిర్వహణలోనూ, సాంకేతిక శిక్షణలోనూ, పెట్టుబడి మదుపు పెట్టడంలోనూ విదేశీ సహాయం యొక్క అవసరాన్ని భారత ప్రభుత్వం గుర్తిస్తున్నదని తీర్మానంలోని ఈ భాగం వెల్లడిస్తుంది. అంతేగాక భారత పరిశ్రమలకు దోహదం చేయడానికి విదేశీ పెట్టుబడికి, నైపుణ్యానికి స్వాగతం పలకడంలోని విజ్ఞతనుకూడా ఇది వెల్లడిస్తుంది.

"విదేశీ పెట్టుబడికి వ్యాపారానికి భారత పరిశ్రమల్లో పూర్తి స్వేచ్ఛ" ఇవ్వడం అన్నది "భారత రత్నం" అత్యంత గౌరవనీయమైన అభ్యుదయ కాముకుడైన "సోషలిస్టు" నెహ్రూ నాయకత్వంలోని భారత ప్రభుత్వపు ప్రకటిత విధానమైంది.

(తరిమెల నాగిరెడ్డి 'తాకట్టులో భారతదేశం' నుంచి)

# వర్చువల్ రియాలిటీలో ఆంధ్రప్రదేశ్

- వి. వంశధార

ఇన్ఫర్మేషన్ టెక్నాలజీకి తాను నేర్పిందో, తానే ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ నుంచి నేర్చుకుందోగాని ఇవ్వాళ ఆంధ్రప్రదేశ్ వర్చువల్ రియాలిటీలో మునిగివుంది. తెలుగుసీమలో ప్రజా జీవనంలో ఈ వర్చువల్ రియాలిటీని గుర్తించవచ్చు. వర్చువల్ రియాలిటీ అనే కంప్యూటర్ పరిభాషిక పదాన్ని తెలుగులోకి అనువాదం చేస్తే విన్నవాళ్ళు నవ్విపోతారు. నిజమైన నిజం ఏమిటి? అబద్ధమైన నిజం కూడా వుంటుందా? అని అడుగుతారు. కాని, నిజంగానే ఒకని వాస్తవాన్ని వాస్తవమేననే భ్రమగొలిపేలా కంప్యూటర్ తెరమీద ప్రదర్శించడమే వర్చువల్ రియాలిటీ. అంటే వర్చువల్ రియాలిటీలో వాస్తవంపాలుకన్నా భ్రమపాలే ఎక్కువన్నమాట.

ఆంధ్రదేశాన్ని చంద్రబాబునాయుడు అభివృద్ధిపథం పట్టించారని ఎందరెందరో కితాబులిస్తున్నారు. ఈ కితాబులన్నీ ఆయన సృష్టించిన వర్చువల్ రియాలిటీ ఫలితాలే. ఆ రకంగా ఆయన స్వర్ణాంధ్రప్రదేశ్ రూపొందిస్తారో లేదో గాని ఆంధ్రప్రదేశ్‌ను వర్చువల్ రియాలిటీగా మార్చిన ఘటన మాత్రం ఆయనకే దక్కుతుంది. చంద్రబాబు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్న ఈ ఆంధ్రప్రదేశ్ వర్చువల్ రియాలిటీ ఇన్‌కార్పోరేటెడ్‌లో మూడు, నాలుగు రంగాలలో ఈ పర్చువల్ రియాలిటీ భావజాలం ఎంత బలంగా దిగిపోయిందో చూస్తే, మెతుకు పట్టి చూసినట్టు ఆంధ్రప్రదేశ్ ప్రస్తుత స్థితిని అర్థం చేసుకోవచ్చు.

అన్ని రంగాలకన్నా మిన్నగా ఆర్థిక, ప్రణాళికా రంగాలలో వర్చువల్ రియాలిటీ అమలవుతోంది. సాధారణంగా వర్చువల్ రియాలిటీ ఎన్విరాన్‌మెంట్ సిడి రామ్‌ల రూపంలో దొరుకుతుంది. ఇప్పుడు దొరుకుతున్న ఆంధ్రప్రదేశ్ వర్చువల్ రియాలిటీ ఎన్విరాన్‌మెంట్ సిడి రామ్ పేరు విజన్ 2020. విజన్ 2020 ప్రకటించిన లక్ష్యాలు, గణాంకాలు వాస్తవమేమోననే భ్రమ గొలుపుతాయి తప్ప వాస్తవం కావడం అసాధ్యం. విజన్ 2020 ప్రకారం మన వ్యవసాయరంగం 2020 నాటికి నాలుగురెట్లు పెరుగుతుంది. సాలీనా ఆరుశాతం పెరుగుతుంది. పారిశ్రామిక రంగం సాలీనా 11 శాతం పెరుగుతూ 2020 నాటికి 13 రెట్లు పెరుగుతుంది. సేవారంగం ఏడాదికి 12 శాతం పెరుగుతూ 2020 నాటికి ఇప్పుడున్నదానికంటే 16 రెట్లు ఎక్కువ వుంటుంది. మొత్తంగా ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ సాలీనా 10 శాతం అభివృద్ధిరేటును, తలసరి ఆదాయం 9 శాతం అభివృద్ధి రేటును సాధిస్తాయి. ఇదంతా జరగాలంటే మొత్తంగా 30 లక్షల కోట్ల రూపాయల పెట్టుబడి అవసరమవుతుంది. ఇందులో 16లక్షల కోట్ల రూపాయలు మౌలిక సౌకర్యాల కల్పనకే అవసరమవుతాయి. ఇటువంటి అంకెలు, ఊహలు, అంచనాలు వర్చువల్ రియాలిటీలో తప్ప వాస్తవంగా సాధ్యం కావు. ఎందుకంటే విజన్ 2020 ప్రకటించిన అన్ని అభివృద్ధి రేట్లు ప్రస్తుతం సగానికన్నా తక్కువ, మూడోవంతుగా వున్నాయి. అవి నిజంగా ఊహించినట్టుగా పెరగాలంటే విపరీతంగా మానవ వనరులు విడుదల కావాలి. లక్ష్యశుద్ధితో మానవ వనరుల వినియోగం జరిగితేతప్ప అటువంటి అభివృద్ధి రేట్లు సాధ్యం కావు. మానవ వనరుల విడుదల జరగాలంటే భూసంస్కరణలు, ప్రాథమిక విద్య, ప్రాథమిక ఆరోగ్యం రంగాలమీద శ్రద్ధ పెట్టాలని ప్రపంచానుభవం చూపుతోంది. కానీ, విజన్ 2020 ఈ మూడు రంగాలను పట్టించుకోలేదు సరిగదా, ఇతోధికంగా ఉపాధి కల్పించే ఏ కార్యక్రమాన్ని ప్రకటించలేదు.

మరోవైపు లెక్కా పత్రమూ లేకుండా భయపెట్టే భారీ పెట్టుబడుల అంకెలను ప్రస్తావించి, ఇంత పెట్టుబడి ప్రభుత్వం పెట్టలేదు కనుక ప్రైవేటు రంగాన్ని ఆహ్వానిస్తున్నానంది. అంటే భూసంస్కరణలను, ప్రాథమిక విద్యను, ప్రాథమిక ఆరోగ్యాన్ని, ఉపాధి కల్పనను ఏమాత్రం పట్టించుకోని అభివృద్ధి నమూనాను ప్రకటించిందన్నమాట. ఈ అభివృద్ధి నమూనాతో స్వర్ణాంధ్రప్రదేశ్ ఒక రియాలిటీ కావడం అసాధ్యం. అందువల్లనే అది వర్చువల్ రియాలిటీగా మిగిలిపోయి, 20 సంవత్సరాల సుదూర గమ్యం వరకూ ఒక భ్రమనూ, ఒక కలనూ అమ్మే సాధనంగా వుండిపోతుంది. ఈ కల నిజం కాలేదేమని ఎవరయినా అడిగే సమయానికి మన కంప్యూటర్లు మరొక కలను ఎట్లాగూ ఉత్పత్తి చేస్తాయి. వర్చువల్ రియాలిటీ సృష్టించడం రాజకీయ నాయకులకు ఎప్పుడూ అలవాటేనని, దాన్ని అంత తీవ్రంగా పట్టించుకోనక్కరలేదని ఎవరయినా అనవచ్చు. తాజాగా అధికార యంత్రాంగంలో జరిగిన ఒక పరిణామం వర్చువల్ రియాలిటీ విస్తరణకు ఉదాహరణగా నిలుస్తుంది.

కాకి మాధవరావు అనే ఐఎఎస్ అధికారి వున్నారు. 1970లో అప్పుడప్పుడే అధికారంలోకి వచ్చిన ప్రగతిశీల దళిత అధికారిగా ఆయనకు పేరు వుండేది. ఆయన 1975లోనూ రాష్ట్ర పాలక వర్గాలతో తలపడ్డారు. ఇప్పుడు 25 సంవత్సరాల తర్వాత రాష్ట్ర ప్రభుత్వంతో హైకోర్టులో తలపడనున్నారు. తేడా అల్లా ఆయన పోరాటం రియాలిటీనుంచి వర్చువల్ రియాలిటీలోకి ప్రవహించింది.

మాధవరావు నక్సలైటనీ, నక్సలైట్ సానుభూతిపరుడనీ, ఆయనను వెంటనే వరంగల్ కలెక్టర్ పదవి నుంచి తొలగించాలనీ కాంగ్రెస్ నాయకుడు హయగ్రీవాచారి నాయకత్వంలో రాష్ట్రం నుంచి పార్లమెంటు సభ్యులు, అసెంబ్లీ సభ్యులు రాష్ట్రపతి వి.వి.గిరి దగ్గరకు ప్రాతినిధ్యం నడిపారు. అందువల్ల అయనను కలెక్టర్‌గా తొలగించి ఎవరికీ పట్టని లిడ్‌క్యాప్‌కు బదిలీ చేశారు. క్రమక్రమంగా ఈ రియాలిటీ నుంచి వర్చువల్ రియాలిటీలోకి ప్రవేశిస్తూ, ఆయన కనీసం ఐదుగురు ముఖ్యమంత్రులకు ఆప్తుడయ్యాడు. చంద్రబాబు నాయుడయితే ఆయన పదవీకాలాన్ని కూడా పొడిగించారు. ఇప్పుడు ఆ చంద్రబాబు ప్రభుత్వం తన కొత్త పదవే రాష్ట్ర ఎన్నికల కమిషనర్ బాధ్యతలకు అడ్డుతగులుతున్నదని, అసలు ఎన్నికల కమిషనర్‌కు మధ్య ఘర్షణలాగా కనబడుతున్న ఈ నిజం నిజానికొక భ్రమ.

ఈ వాస్తవానికీ - మిథ్యకూ మధ్య రేఖ చెరిగిపోవడం రాజకీయ, పాలనారంగాల్లో కాలేజీలో పట్టపగలు అందరిముందూ నరికి చంపాడన్నా, పది సంవత్సరాల ప్రేమ వాస్తవాన్ని ఒకటి రెండు సందర్భాల మిథ్య, అపోహ దెబ్బతీసి ఒక విద్యార్థికుడు మరొక విద్యార్థికురాలిని ఉరితీసి చంపాడన్నా, ఎప్పుడో కొన్ని సందర్భాల తర్వాత, స్వర్ణాంధ్రప్రదేశ్ రూపొందేటప్పుడు తన కూతుళ్ళ పెళ్ళి చేయలేనని, హైటెక్ సిటీ నీడలో ఒక తండ్రి తన కూతుళ్ళను చంపాడన్న మన సమాజ సంస్కృతిలోనే వాస్తవానికీ - భ్రమలకీ మధ్య ఘర్షణ, రియాలిటీకి వర్చువల్ రియాలిటీకి మధ్య ఘర్షణ అతి భయంకరమైన హింసాత్మక రూపాలు తీసుకుంటుందన్నమాట. మూడువేల ఏళ్ళుగా విజయాలతో, వైఫల్యాలతో, ఆనందాలతో, విషాదాలతో, కన్నీళ్ళతో, చిరునవ్వులతో, రియాలిటీతో బతికిన ఒక గొప్పజాతి ఇప్పుడిక కాల్పనిక, భ్రమాత్మక, మిథ్యా వాస్తవికతలోకి ప్రవేశించబోతున్నదన్నమాట.

(ఆంధ్రా పాలిటిక్స్.కామ్, అక్టోబర్ 3, 2000) ❐

## సమీక్షా సమీక్ష

ఫిబ్రవరి 15-28 సంచికలో 'ముసాయిదా బడ్జెట్ మూసి పెట్టిన నిజాలు' అపర్ణగారు వ్రాసిన వ్యాసం మీద నా అభిప్రాయం: మొత్తం వ్యాసంతో పేచీలేదు గాని, చివరి పేరాలోని అవగాహన లోపాన్ని మీ దృష్టికి తీసుకువస్తున్నాను.

"అవినీతిని రెడ్ టేపిజాన్ని నక్సలిజంను అరికడితే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు వస్తాయని' అంటున్నారు. 'అభివృద్ధికి నక్సలైట్లు ఆటంకులు' అని పాలకులూ ఇలాగే మాట్లాడుతున్నారు. వ్యాసకర్త దృష్టిలో విదేశీ పెట్టుబడులే దేశాభివృద్ధికి అత్యుత్తమ మార్గంలా ఉంది. స్వదేశీ వృత్తులను, పరిశ్రమల్ని నాశనం చేసే విదేశీ పెట్టుబడులు కావాలా? విదేశీ పెట్టుబడుల్తో రాష్ట్రం అభివృద్ధి చెందేనా? దేశంలోని, రాష్ట్రం లోని సహజ వనరులను ఉపయోగించుకుని స్వయం సమృద్ధిని సాధించాలని ప్రజలు సమానావకాశాలతో జీవించాలని నక్సలైట్లు కోరుకుంటున్నారు. పరిశ్రమల పేరుతో పెట్టుబడులు పెట్టి, దోపిడీతో మన దగ్గరి సంపదను దోచుకుపోవటాన్ని ఖచ్చితంగా వారు వ్యతిరేకిస్తున్నారు. నక్సలిజం సామాజిక, ఆర్థిక సమస్యలనుండి పుట్టిందని వ్యాసకర్త గుర్తిస్తే మంచిది.

- చిన్న
భువనగిరి.

ప్రజాపక్ష సమీక్ష - నాలుగు సంచికలు అక్షరం వదలకుండా చదివేను. నిస్సందేహంగా, నేడు గాని, లోగడకాని, లేని పద్ధతిలో ప్రజాపక్షపాతం వహించే విశ్లేషణలతో వస్తున్న ఏకైక పత్రిక. నేను చదవడమే గాకుండా, 'అవగాహన'కు తరచూ వచ్చే మిత్రులచేత చదివిస్తున్నాను. ఒకటి రెండు కార్టూన్లు వేయండి. కవిత, కథలకు ఒకటి రెండు పేజీలు కేటాయించండి. వ్యాసాల మధ్య ఫోటోలు తప్పనిసరిగా వేయండి. అన్ని హైస్కూలు, కాలేజి, యూనివర్సిటీ, మండలస్థాయి ప్రయివేటు, ప్రభుత్వ గ్రంథాలయాలకు తెప్పించుకుని తప్పక చదవగలిగిన పత్రిక.

- డా॥ మానేపల్లి
యలమంచిలి

'ప్రజాపక్ష సమీక్ష' నిజంగా ప్రజాపక్షంగా నిలబడగలదని విశ్వసించడానికి ఇప్పటిదాకా వచ్చిన నాలుగు సంచికలే సాక్ష్యం. 'ప్రజాపక్ష సమీక్ష' తన ప్రయాణంలో ప్రజలకు సంబంధించిన మరిన్ని వాస్తవ కన్నీటి చరిత్రల్ని శోధించి ప్రచురించడం ద్వారా ప్రజలతో సమీక్షా బంధాన్ని దృఢపరుస్తుందని ఆశిస్తున్నా.

- శంకర్
ఆదిలాబాద్

గత నాలుగు ప్రజాపక్ష సమీక్షలు చాలా బాగున్నాయి. వ్యాసాలు ఆలోచనాత్మకంగానే ఉన్నా, 'సమీక్ష' నుండి వైవిధ్య భరిత వ్యాసాల్ని ఆశిస్తున్నాం. దోపిడి వర్గ సమాజంలో మహిళలెదుర్కొంటున్న సమస్యలపై, రెగ్యులర్‌గా ఒక శీర్షిక ప్రారంభిస్తే బాగుంటుంది. శ్రామిక వర్గం లోని కొన్ని సెక్షన్ల దైన్య దౌర్జన్య స్థితి అసలు సమాజానికే తెలియదు. ఉదాహరణకు, సెక్యూరిటీ గార్డ్స్ ఇది ఒక రకంగా మనుషులపై ప్రత్యక్షంగా వ్యాపారమే. దీనిమీద ప్రత్యేక వ్యాసం రావాలని కోరుకుంటున్నాం. అలాగే వివక్షకు గురైన గ్రామాల్లో వ్యవసాయం వట్టిపోగా పట్నం వచ్చి భవన నిర్మాణ రంగంలో, హోటల్ రంగంలో అతి తక్కువ వేతనాలపై పనిచేస్తున్న వారి కష్టాలపై వ్యాసాన్ని కోరుతున్నాం.

- దర్శిణి
వరంగల్

# దా'రుణాంధ్ర'ప్రదేశ్

- వి. హనుమంతరావు

ఏ ఇంట్లో అయినా, ఏ గృహస్థు అయినా తన బిడ్డ పెళ్లికో, ఓ ఇల్లు కట్టుకోవడానికి, పిల్లలను పెద్ద చదువులను చదివించడానికో కాస్త డబ్బు వెనకేసుకోవడానికే ప్రయత్నిస్తున్నాడు. కాని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి అలాంటి సమస్య లేదు. అలాంటి ఆలోచనతో తలచెడగొట్టుకోదు. ఎడమచేత్తో, కుడిచేత్తో అప్పులు తెచ్చి సమస్యను పరిష్కారం చేస్తుంది. అది చంద్రబాబు విధానం. ఆయన స్టైలే వేరు. ప్రతిపక్షాలు, ఆర్థిక నిపుణులు, అకౌంటెంట్ జనరల్ (కాగ్) హెచ్చరికలు చేస్తున్నా వినిపించుకోకుండా, నడుస్తున్న సంవత్సరానికి సవరించిన అంచనా ప్రకారం పేర్కొన్న రుణ భారం రు. 49921.6 కోట్లు ఇది అంచనా ప్రకారం 2003-04లో రు. 51750 కోట్లకు చేరుకుంది. గారంటీలు కూడా కలుపుకొంటే రు. 72858.05 కోట్లకు చేరుకుంటుంది. దీనికి మరో రు. 4950.48 కోట్లు కలపాలి (అకౌంటెంట్ జనరల్ ప్రకారం రుణ భారాన్ని ఈ మేరకు తక్కువగా చూపించింది) రుణభారం రు.77808.53 కోట్లకు చేరుకుంటుంది. రాష్ట్రజనాభా 7.6 కోట్లు కాబట్టి తలసరి రుణ భారం రు. 10238లు. 03-04 ముసాయిదా బడ్జెట్ పత్రంలో ఇందుకు సంబంధించిన గణాంక వివరాలిలా వున్నాయి.

రాష్ట్రం ప్రధానంగా కేంద్ర ప్రభుత్వం నుంచి రుణాలు తెచ్చుకొంటుంది. ఇందులో విదేశాల నుంచి, ప్రపంచ బ్యాంకు తదితర అంతర్జాతీయ సంస్థల నుంచి తెచ్చుకొనే రుణాలు కలిసి వుంటాయి. మార్కెట్లో బాండ్లు విడుదల ద్వారా రుణాలు సేకరించటం రెండో పద్ధతి. ప్రభుత్వ, సెమీ-ప్రభుత్వ సంస్థల ద్వారా రుణాలు సేకరించటం మూడో పద్ధతి. నాబార్డ్, లైఫ్ ఇన్సూరెన్సు కార్పోరేషన్, జనరల్ ఇన్సూరెన్స్ కార్పోరేషన్, చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం (ఈ ఉద్యమం నడిపేది రాష్ట్ర ప్రభుత్వమే అయినా, పెత్తనం కేంద్రానిది), ప్రావిడెంట్ ఫండు - ఇన్ని సంస్థల నుంచి ప్రభుత్వం రుణాలు సేకరిస్తుంది. వీటిమీద వడ్డీరేట్లు ఆయా సంస్థల నియమ నిబంధనల మేరకు ఉంటాయి. అయినా నిధుల కొరత లేదు. ముఖ్యమంత్రికి రుణం సొమ్ము అంటే రుచికరంగా వుంటుంది కాబోలు - కేంద్రంతో నిమిత్తం, అనుమతి లేకుండా నేరుగా ప్రపంచబ్యాంకు నుంచి నిధులను తెచ్చుకోవడాన్ని అనుమతించాలన్న ముఖ్యమంత్రి చంద్రబాబు కేంద్రాన్ని డిమాండు చేస్తున్నారు. అపుడు చమురు తెచ్చుకోవడానికి పైప్‌లైన్లు వేసినట్లు, బ్యాంకు నుండి నిధుల ప్రవాహానికి ఓ పైప్‌లైన్ వేస్తారు కాబోలు. సహజంగానే కేంద్ర ఈ కోర్కెను తిరస్కరించింది. రాష్ట్రం ఇలా అప్పులపాలు ఎందుకు కావాల్సి వచ్చింది? 97-98 నుండి 01-02 మధ్యకాలంలో స్థూల రెవెన్యూ ఆదాయం స్థూల రాష్ట్రాదాయంలో 12.61 శాతం నుంచి 14.45 శాతానికి పెరిగితే, రెవెన్యూ పద్దు కింద ఖర్చు 21.98 నుంచి 27.47 శాతానికి పెరిగింది. ప్రభుత్వం తన ఖర్చును అదుపులో వుంచుకోలేకపోవటం వల్ల ఆదాయానికి,

## ప్రభుత్వ రుణభారం

(రు. కోట్లలో)

| | 00-01 వాస్తవం | 01-02 బ.అం. | 01-02 వాస్తవం | 02-03 బ.అం | డిసెంబర్ వరకూ | 02-03 సం.అం | 03-04 ము.అం |
|---|---|---|---|---|---|---|---|
| కేంద్రరుణం | 16,510 | 19,700 | 19,033 | 21,900 | 19,839 | 20,621 | 23,277 |
| మార్కెట్ రుణం | 9,138 | 10,337 | 11,034 | 12,234 | 12,239 | 13,434 | 14,756 |
| చిన్న మొత్తాల పొదుపు | 2,928 | 4,578 | 4,074 | 5,928 | 5,693 | 5,928 | 7,842 |
| ప్రావిడెంట్ ఫండ్ | 3,436 | 3,751 | 3,757 | 4,227 | 3,783 | 4,149 | 4,577 |
| ఇతరాలు | 3,639 | 6,029 | 4,590 | 5,593 | 5,153 | 5,786 | 6,697 |
| మొత్తం | 35,651 | 44,395 | 42,492 | 49,884 | 46,707 | 49,922 | 57,150 |

వ్యయానికి మధ్య అంతరం పెరిగిపోయి, ఆ వెలితిని పూడ్చడానికి అప్పు చేయాల్సి వస్తుంది. వర్ధమాన దేశాలన్నీ ఈ సమస్యను ఎదుర్కొంటున్నాయి. రుణాన్ని ఉత్పత్తి వ్యాపకాల్లో పెట్టుబడి పెడితే, రుణం తిరిగి చెల్లించడానికి అవకాశం ఏర్పడుతుంది. కాని ప్రభుత్వం రుణాలను ప్రచారానికి, పాప్యులిస్టు పథకాలకు ఖర్చు చేస్తుండడం వల్ల అప్పు తీర్చడం మాట అటుంచి, వడ్డీ కూడా పూర్తిగా చెల్లించలేక, మళ్లీ రుణం తీసుకొని వచ్చి చెల్లింపులు, చేసే చక్కర్‌లో పడిపోయింది. తాజాగా ప్రపంచబ్యాంకు నుంచి వ్యవస్థాగత సర్దుబాటు రుణం కోసం ప్రభుత్వం చెయ్యి చాచింది. ఆ రుణం ఒక విడత అనుకొన్న సమయంలో రాకపోయేసరికి విలవిలలాడి పోయింది. 'కట్ ది కోట్ అకార్డింగ్ టు ది క్లాక్' అని ఇంగ్లీషులో ఒక సామెత వుంది. ఉదాహరణకు ముఖ్యమంత్రి ఇన్నిసార్లు, దావోస్ సమావేశాలకు వెళ్ళి గుప్పెడు గింజలు కూడా తీసుకొని రాలేకపోయారు. రాష్ట్రంలో కరువు తాండవిస్తుంటే, ముఖ్యమంత్రి దావోస్ వెళ్ళకుండా, రాష్ట్రంలో ఉన్న పరిస్థితుల దృష్ట్యా నేనీ ప్రయాణాన్ని రద్దు చేసుకుంటున్నా'నని ప్రకటించి వుంటే, ఆయన ప్రజల దృష్టిలో ఎంతో ఎదిగి వుండేవారు. ఇపుడు పరువు పొగొగ్టుకున్నారు. తెలుగుదేశం అధికారంలోకి వచ్చే వరకూ కాంగ్రెస్ పాలనలో అంటే 27 సంవత్సరాల్లో 21 సంవత్సరాలు మిగులు బడ్జెట్లు చూపించగా, ఆ తర్వాత సంవత్సరాల్లో నేటివరకూ బహుశా మూడు సంవత్సరాలు తప్ప మిగతా అన్ని సంవత్సరాల్లో లోటు బడ్జెట్లే ప్రవేశపెట్టబడ్డాయి. "తెలుగుదేశం గుడ్ గవర్నెన్స్" కు ఇదో ఉదాహరణ. ఈ లోటు తెగులును నివారించడానికి చర్యలు తీసుకోకుండా, అవసరమైనపుడల్లా అప్పులకోసం పరుగులు తీస్తుంటే, ఆపాటి పనికి చంద్రబాబు అవసరం లేదు. ఓ ప్రధాన కార్యదర్శి ఆ పని చేయవచ్చు. లోటు తగ్గితే, మిగులు చూపగలిగితే, ఆ మేరకు రుణం అవసరం లేకుండా పోతుంది. ఉదాహరణకు వేసిన పన్నులను వసూలు చేయటంలో అసమర్ధత, లాలూచీ స్పష్టం. పన్నుల బాకీలు 96-97లో రు. 1201 కోట్ల నుంచి 2000-01లో రు. 2666 కోట్లకు అంటే రెట్టింపుకుపైగా పెరిగాయి. 2002-03లో బడ్జెట్ లోటు అంచనా రు. 2482 కోట్లు. బాకీలే వసూలు చేయగలిగి వుండివుంటే లోటు బడ్జెట్ అవసరమే ఏర్పడి వుండేదికాదు.

1995-96 నుంచి ఈ రుణం రు. 15164 కోట్ల నుంచి ఎనిమిదేళ్ళలో అయిదు రెట్లు పెరిగి, 03-04లో రు. 57150 కోట్లకు పెరుగుతుందన్నమాట! రాష్ట్రం స్థూలరాష్ట్రాదాయంలో రుణశాతం 00-01లో 25.62 శాతం నుంచి 03-04లో 31.33 కు పెరగగా, ప్రభుత్వ గ్యారంటీలు 9.59 నుంచి 8.61 శాతానికి తగ్గనున్నాయి. స్వర్గీయ బెజవాడ గోపాలరెడ్డి 1957లో ఆర్థిక మంత్రిగా వున్నప్పుడు 'మన ఆర్థిక పరిస్థితిని ఎలా మానేజ్ చేయాలంటే మనం భావితరాల వారిమీద భారం వెయ్యకుండా, పెంచకుండా వుండాలి' అని అన్నారు. బడ్జెట్ ప్రకారం వడ్డీ చెల్లింపులు ఈ కింది విధంగా వున్నాయి.

వడ్డీ చెల్లింపులు (రు. కోట్లు)

| | |
|---|---|
| 00-01 వాస్తవం | 4354.06 |
| 01-02 బ.అం. | 5641.38 |
| 01-02 వాస్తవం | 5158.37 |
| 02-03 బ.అం. | 6365.30 |
| డిసెంబర్ వరకు ఖర్చు | 3117.30 |
| 02-03 బ.అం. | 6135.81 |
| 03-04 బ.అం. | 6879.79 |

తలసరి వడ్డీ రు. 905లు. తలసరి రుణంతో కలిపితే ప్రతీ వ్యక్తి మీద సగటు భారం రు. 11143లు. రాష్ట్రంలో సుమారుగా సగం జనాభా దారిద్ర్యరేఖకు దిగువన కాని ఆ దరిదాపుల్లోగాని నివసిస్తున్నారు. వారి వారసులు ఇంత భారాన్ని మోయగలరా? రాజ్యాంగం ప్రకారం పార్లమెంటు, శాసన సభల అనుమతి లేనిదే విదేశీ రుణాలు తీసుకోరాదు. ఈ నిబంధనను కేంద్రం, రాష్ట్రాలు తుంగలో తొక్కాయి. చట్టసభలు ఈ రుణాలను ఒక పరిమితి విధించాలని, ఆ హద్దుమీరకూడదని ఒక చట్టం పాస్ చేయాలని కూడా రాజ్యాంగం పేర్కొంది. ఆ ధైర్యం కేంద్రానికి లేదు. రాష్ట్రాలకూ లేదు. రాష్ట్రాలు హద్దుమీరి రుణాలు చేస్తున్నాయని హెచ్చరించే కేంద్రమే హద్దుమీరి రుణాలు చేస్తున్నది.

## ప్రభుత్వ గ్యారంటీలు

(రు. కోట్లలో)

| | 00-01 వాస్తవం | 01-02 బ.అం. | 01-02 వాస్తవం | 02-03 బ.అం | డిసెంబర్ వరకూ ఖర్చు | 02-03 సం.అం | 03-04 బ.అం |
|---|---|---|---|---|---|---|---|
| విద్యుచ్ఛక్తి | 7664 | 9460 | 9944 | 9916 | 9869 | 9890 | 10842 |
| ఇతరాలు | 5676 | 5515 | 4910 | 5013 | 4491 | 4491 | 4877 |
| మొత్తం | 13340 | 14975 | 14855 | 14929 | 14360 | 14382 | 15709 |

అప్పులేనిదే అభివృద్ధి అసాధ్యం అంటున్నారు ముఖ్య మంత్రి. ఒక ప్రక్క తెచ్చిన అప్పులో, సగం రోజువారీ ఖర్చులకే ఖర్చయిపోతుందని రిజర్వు బ్యాంకు అంటుంటే, అప్పంతా అభివృద్ధికే ఖర్చు చేస్తున్నామని ముఖ్యమంత్రి పచ్చి అబద్ధం.

తెచ్చిన అప్పు అభివృద్ధికి ఖర్చు చేయటం లేదని ప్రతిపక్షాలు చేస్తున్న ఆరోపణ అక్షరాలా నిజమనీ, తెచ్చిన అప్పులో సగం భాగం అప్పు తిరిగి చెల్లించడానికే తరలిపోతుందని కాగ్ గణాంకాలు రుజువు చేస్తున్నాయి.

అప్పు తెచ్చి అభివృద్ధిని సాధిస్తున్నాం అంటున్న ముఖ్య మంత్రి ప్రకటనను మరోకోణం నుంచి కూడా పరిశీలించవచ్చు. రాష్ట్ర ఆర్థిక మంత్రి 02-03 బడ్జెట్ పత్రాలతో ఇచ్చే బడ్జెట్ - ఇన్ - గ్లాన్స్' పత్రంలో (పేజీ 12) అభివృద్ధి కోసం చేసే ఖర్చు 97-98లో మొత్తం ఖర్చులో 65.73 శాతం నుంచి 02-03 బడ్జెట్ అంచనా ప్రకారం 58.28 శాతానికి తగ్గిపోగా అభివృద్ధేతర ఖర్చు 34.27 శాతం నుంచి 41.72 శాతానికి పెరిగింది. అప్పు పెరుగుతోంది. అభివృద్ధి తరుగుతోంది.

అలాగే ప్రణాళిక ఖర్చు అంటే అభివృద్ధి ఖర్చు అని, ప్రణాళికేతర ఖర్చు అంటే పరిపాలనా ఖర్చు అని విభజించి ప్రభుత్వ గణాంకాలు ఇస్తుంది. అభివృద్ధి ఖర్చ ప్రణాళిక ఖర్చు అని ప్రణాళిక ఖర్చు గణాంకాలను చూస్తే ఏ ఒక్క సంవత్సరంలోనూ ప్రణాళికేతర కేటాయింపు పూర్తిగా ఖర్చు కాలేదు. అకౌంటెంట్ జనరల్ పూర్తిగా ఇచ్చిన 'ఎకౌంట్స్ -ఎట్ - గ్లాన్స్' ప్రకారం 2001-2002 బడ్జెట్ అంచనా ప్రకారం ప్రణాళికా ఖర్చు అంచనా రు. 10960.30 కోట్లు కాగా, వాస్తవంలో ఖర్చు చేసింది రు. 9362.23 కోట్లు మాత్రమే. 02-03 బడ్జెట్ అంచనా (ముసాయిదా బడ్జెట్ ప్రకారం) రు. 11299.51 కోట్లయితే సవరించిన అంచనా ప్రకారం ఖర్చు కోబోయేది రు. 9876.71 కోట్లు మాత్రమే. ఆచరణ ఇలా వుండగా వచ్చే ఆర్థిక సంవత్సరంలో రు. 11877.80 కోట్లు ఖర్చు చేయ బోతున్నారంటే ఎలా నమ్మడం? కాగా ప్రణాళికాభివృద్ధి అనుకొన్నట్లు జరగటం లేదని స్పష్టమవుతుంది. నిధుల్లేవని ప్రణాళిక అమలు కోసం విదేశీ నిధులు తెచ్చి కూడా అభివృద్ధి సాధించలేక పోతోంది.

**అభివృద్ధిని సాధించలేని 'జన్మభూమి'**

జన్మభూమి కార్యక్రమాల ద్వారా అభివృద్ధి సాధిస్తున్నాం అంటుంది ప్రభుత్వం. ఇతర రాష్ట్రాల ముఖ్యమంత్రులు, ప్రతినిధి వర్గాలు ఈ కార్యక్రమాన్ని ఎంతగానో మెచ్చుకొన్నారని, తమ తమ రాష్ట్రాల్లో కూడా ఇలాంటి పథకాలను ప్రవేశపెడతామని చెప్పినట్లు ప్రభుత్వ ప్రకటనలు తెలియజేస్తున్నాయి. పేరు వేరయినా, ఇతర పేర్లతో ఇలాంటి కార్యక్రమాలు, జన్మభూమి కార్యక్రమాలు ప్రారంభించకముందే ఇతర రాష్ట్రాల్లో అమలు అవుతున్నాయని మన ప్రభుత్వానికి తెలియకపోదు. అయితే, రాష్ట్ర ప్రజలకు అది తెలియదు కాబట్టి, నేనే ఫస్ట్, నా రాష్ట్రమే ఫస్ట్ అని జనాన్ని తప్పుదోవ పట్టిస్తుంది. అభివృద్ధి ఫలితాలు ప్రథమంగా, ప్రధానంగా దళితులకు, గిరిజనులకు, వెనుకబడిన తరగతులకు స్త్రీలకు అందాలి కదా! మన రాష్ట్రమే ఫస్ట్ కాబట్టి అన్ని రాష్ట్రాల కన్నా మనం అగ్రస్థానంలో వుండాలి కదా! వీరెంత అభివృద్ధి సాధించారో అనేదానికి ఆయా పద్దులకు కేటాయించి, ఖర్చు చేసిన వివరాలే ఒక గీటురాయి.

## నికర రుణం (రు. కోట్లలో)

| | 96-97 | 97-98 | 98-99 | 99-2000 | 2000-2001 |
|---|---|---|---|---|---|
| **అంతర్గత రుణం** | | | | | |
| వచ్చిన రుణం | 2,793 | 4,178 | 6,853 | 9,976 | 13,208 |
| తిరిగి చెల్లింపు (అసలు,వడ్డీ) | 2,283 | 4,007 | 5,997 | 8,956 | 11,475 |
| నికర రుణం (శాతం) | 510 (50) | 171 (20) | 926 (43) | 1020 (44) | 1733 (51) |
| **కేంద్ర రుణాలు, అడ్వాన్సులు** | | | | | |
| వచ్చిన రుణం | 1,636 | 2,054 | 3,022 | 3,189 | 1,889 |
| తిరిగి చెల్లింపు (అసలు, వడ్డీ) | 1,941 | 1,703 | 2,618 | 2,292 | 2,701 |
| నికర రుణం (శాతం) | (-) 305 | 351 (18) | 404 (17) | 879 (28) | (-) 812 |
| **ఇతర రుణాలు** | | | | | |
| వచ్చిన రుణం | 6,689 | 7,892 | 10,177 | 10,178 | 12,195 |
| తిరిగి చెల్లింపు (అసలు,వడ్డీ) | 6,222 | 7,467 | 9,160 | 9,863 | 9,938 |
| నికర రుణం (శాతం) | 467 (7) | 430 (5) | 1017 (10) | 315 (3) | 2257 (19) |

వేస్ అండ్ మీన్స్ అడ్వాన్సులు మినహాయింపుగా వచ్చినది నికర రుణం.

రాష్ట్రంలో ప్రస్తుత ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటి నుండి అనగా 1995-96 నుండి 2002-03 వరకు రాష్ట్ర బడ్జెట్‌లో షెడ్యూల్డ్ కులాలు, తెగలు, వెనకబడ్డ వర్గాలు, స్త్రీ - శిశు సంక్షేమానికి మొత్తం ఖర్చు 1995-96 సంవత్సరంలో రు. 785.03 కోట్లు వుండగా, క్రమేణా 2002-03 బడ్జెట్ అంచనాల ప్రకారం రు. 2649.13 కోట్లకు పెరిగింది. అనగా 19 శాతం కాంపౌండ్ అభివృద్ధి రేటు నమోదయింది. షెడ్యూల్డ్ కులాల వారి సంక్షేమానికి 1995-96 వ 55 శాతం ఖర్చుచేయగా 2002-03 సంవత్సరంలో 24.3 శాతానికి పడిపోతుందని అంచనా. షెడ్యూల్డ్ తెగల సంక్షేమానికి 1995-96లో 18.5 శాతం ఖర్చు చేయగా 2002-03 సంవత్సరంలో 11.5 శాతం ఖర్చు చేయగా 2002-03 సంవత్సరంలో 9.7 శాతానికి పడిపోయిందని అంచనా. కాగా, 1995-96 లో స్త్రీ శిశు సంక్షేమానికి 6.8 శాతమే ఖర్చు చేయగా 2000-03 సంవత్సరం 36.6 శాతం ఖర్చు చేయబోతున్నట్లు బడ్జెట్ అంచనాల వల్ల తెలుస్తోంది. ఇది బిల్‌గేట్స్ సలహానా, లేక ప్రపంచ బ్యాంకు సలహానా అనేది ప్రభుత్వం ప్రజలకు తెలియజేయవలసిన అవశ్యకత ఎంతైనా వుంది. షెడ్యూల్డ్ కులాలలో, తెగలలో, విద్యాపరంగా చూసినా డ్రాపౌట్స్ అధికంగానే వున్నట్లు తెలుస్తోంది. మరో 2005 సంవత్స రానికల్లా రాష్ట్రంలో సంపూర్ణ అక్షరాస్యత సాధిస్తామని చాటుతున్నా వీరిలో డ్రాపౌట్స్ అరికట్టేటట్లుగా గోచరించటం లేదు - ఎన్ని చదువుల పండుగ, అక్షరజ్యోతి, మళ్లీ బడికి పథకాలు చేపడుతున్నా! కోఠారి కమిషన్ నివేదిక ప్రకారం విద్యకు స్థూల ఉత్పత్తిలో అధికం ఖర్చు చేయాలని నిర్దేశించినా మనం ఖర్చు చేసేది చాలా స్వల్పం.

ఇక మన సరిహద్దు రాష్ట్రాలతో పోలిస్తే, షెడ్యూల్డ్ కులాల, తెగల మరియు ఒబిసిల సంక్షేమానికి రెవెన్యూ పద్దుకింద అభివృద్ధి ఖర్చులో 1995-96లో 7.76 శాతం ఖర్చు చేయగా, 1996-97లో 5.62 శాతం, 2001-02 సంవత్సరంలో 7.20 శాతం ఖర్చు చేసినట్లు తేటతెల్లమవుతోంది. కాగా, కాంగ్రెస్ పార్టీ అధికారంలోవున్న మధ్య ప్రదేశ్ రాష్ట్రంలో వీరి సంక్షేమానికి రెవెన్యూ పద్దు కింద మొత్తం అభివృద్ధి ఖర్చులో 1995-96 సంవత్సరంలో 9.69 శాతం ఖర్చు చేయగా ఇది క్రమంగా పెరిగి, 2001-02 సంవత్సరంలో 11.06 శాతానికి పెరిగింది. అనగా బడుగు వర్గాల సంక్షేమానికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం మనకంటే ముందడుగులో వుందన్నమాట అక్షరసత్యం. క్యాపిటల్ అకౌంట్స్‌లో చూసినా మధ్యప్రదేశ్ రాష్ట్రం రివ్వురివ్వున ముందుకు సాగుతున్నట్లు తెలుస్తోంది. కర్ణాటక, తమిళనాడు, మహారాష్ట్ర, ఒరిస్సాలు మనకంటే తక్కువ శాతమే వీరి సంక్షేమానికి రెవెన్యూ పద్దు కింద ఖర్చు పెడుతున్నాయి.

సౌకర్యాల నివేదికలో గణాంకాలు చూస్తే కేంద్ర ప్రభుత్వం విడుదల చేసిన మానవాభివృద్ధి ఏదో ఒక ప్రకారం షెడ్యూల్డ్ కులాలవారికి మరుగుదొడ్డి సౌకర్యాలు మహారాష్ట్రలో 16.81 శాతం వారికి వుండగా, మన రాష్ట్రంలో 6.66 శాతం వారికే ఈ సదుపాయం వుంది. తమిళనాడులోని 9.84 శాతం, కర్ణాటకలో 9.24 శాతం వుంది. అనగా మనం ఈ రాష్ట్రాలతో పోలిస్తే వెనకబడే వున్నాం. షెడ్యూల్డ్ తెగలవారికి మరుగుదొడ్డి సౌకర్యాలు తమిళనాడులో 11.37 శాతం వారికి వుండగా, కర్ణాటకలో 8.90 శాతం, మహారాష్ట్రలో 7.01 శాతం వుండగా మన రాష్ట్రంలో షెడ్యూల్డ్ తెగలలో 3.50 శాతం వారికే ఈ వసతి వుంది. రక్షిత తాగునీటి సదుపాయం. ఈ మానవాభి వృద్ధి నివేదిక ప్రకారం షెడ్యూల్డ్ కులాలలో కర్ణాటకలో 78.63 శాతం వారికి వుండగా, తమిళనాడులో 70.5 శాతం వారికి, మహారాష్ట్రలో 69.53 శాతం వారికి, మన రాష్ట్రంలో 57.56 వారికి ఈ వసతి వుంది. అనగా, మనం కర్ణాటక, తమిళనాడు, మహారాష్ట్ర కంటే వెనుకబడి వున్నాం. ఇక షెడ్యూల్డ్ తెగలలో ఈ వసతి కర్ణాటకలో 74.03 శాతం వారికి వుండగా, మన రాష్ట్రంలో 50.14 శాతం వారికే వుంది. అనగా కర్ణాటకకంటే మనది వెనుకంజే.

ఇక ఈ మానవాభివృద్ధి నివేదిక ప్రకారమే షెడ్యూల్ కులాల కుటుంబాలకు మహారాష్ట్రలో 58.68 శాతం విద్యుత్ సౌకర్యాలు వుండగా, మధ్యప్రదేశ్‌లో 48.74 శాతం, కర్ణాటకలో 33.56 శాతం, తమిళనాడులో 30.91 శాతం విద్యుత్ కనెక్షన్లు వుండగా, ఆంధ్రప్రదేశ్‌లో 24.17 శాతమే వుంది. ఈ దిశలో గూడా మనది వెనుకంజే. షెడ్యూల్డ్ తెగలవారికి ఈ సదుపాయం మహారాష్ట్రలో 46.63 శాతం వుండగా, కర్ణాటకలో 31.42 శాతం, తమిళనాడులో 30.31 శాతం, మధ్యప్రదేశ్‌లో 28.49 శాతం వుండగా, మన రాష్ట్రంలో 13 శాతమే ఈ సదుపాయం ఉంది. అంటే, పై రాష్ట్రాలతో పోలిస్తే మన ప్రగతి తిరోగమంలో వున్నట్లే కదా!

షెడ్యూల్డ్ కులాలలో అక్షరాస్యత ఈ మానవాభివృద్ధి నివేదిక ప్రకారం మహారాష్ట్రలో 56.46 శాతం వుండగా, తమిళ నాడులో 46.74 శాతం, కర్ణాటకలో 38.06 శాతం, ఒరిస్సాలో 36.78 శాతం, మధ్యప్రదేశ్‌లో 38.08 శాతం, మన రాష్ట్రంలో 31.59 శాతమే. షెడ్యూల్డ్ తెగలలో అక్షరాస్యత మహారాష్ట్రలో 36.79 శాతం వుండగా, కర్ణాటకలో 36.01 శాతం, తమిళనాడులో 27.89 శాతం, ఒరిస్సాలో 22.31 శాతం వుండగా, ఆంధ్రప్రదేశ్‌లో 17.16 శాతమే వుంది. అక్షరక్రమంలో అగ్రగామిగా వున్నా అక్షరాస్యతలో మనం వెనుకబడే వున్నాం. మొత్తం మీద డ్రాపౌట్స్ I-X క్లాసులలో భారత మానవాభివృద్ధి నివేదిక ప్రకారం ఒరిస్సాలో 52.27 శాతం వుండగా, తమిళనాడులో 58.01 శాతం, మహారాష్ట్రలో 59.33 శాతం, మధ్యప్రదేశ్‌లో 66.73 శాతం, కర్ణాటకలో 68.02 శాతంగా వుండగా ఆంధ్రప్రదేశ్‌లో 77.44 శాతం.

మానవ పేదరికం సూచిలో దేశం మొత్తం మీద మహారాష్ట్ర 8వ స్థానంలో వుండగా, తమిళనాడు 11వ స్థానంలో, కార్ణటక 16 వ స్థానంలో వుండగా, మన రాష్ట్రం 19వ స్థానంలో ఉంది.

అంకెల్లోనూ, ఆచరణలోనూ కూడా అభివృద్ధి కనుపించ లేదు. ఈ రుణం తీసుకోవటం అభివృద్ధి కోసమేనన్న వాదన పూర్తిగా వీగిపోయింది. మరి అప్పెందుకు చేయాలి? దీనికే ముఖ్యమంత్రి జవాబివ్వాలి. ❒

# ఫిబ్రవరి 1 - 15, 2003

## దేశం

1. కొలంబియా కూలిపోయి ఏడుగురు వ్యోమగాముల మరణం
   ఆకలిచావులన్నీ పత్రికల కధనాలే - ప్రధాని
2. ఇరాక్‌కు వ్యతిరేకంగా ఇండియా అమెరికాతో జత కట్టబోదు - ఫెర్నాండెజ్
3. ఉత్తర ప్రదేశ్‌లో ముఖ్యమంత్రిపై కాంగ్రెస్, ములాయం జంటగా ఎదుర్కోవడానికి సిద్ధం.
4. కంచి ఆచార్య, ప్రధాని చర్చలు
   నలుగురు కాంగ్రెస్ శాసనసభ్యులు యు.పి. మంత్రివర్గంలో చేరిక.
5. అయోధ్య : సుప్రీంకోర్టుకు కేంద్రం అభ్యర్ధన
6. తిరిగి బంగ్లాదేశ్‌కు చేరిన బంగ్లాదేశీయులు
   నాలుగు ఒప్పందాలపై భారత-ఫ్రాన్స్ సంతకాలు
8. ప్రపంచ క్రికెట్ ప్రారంభం
   భారత్-పాక్‌ల దౌత్యయుద్ధం - హై కమీషనర్ల బహిష్కరణ
   తమిళనాడుకు 4500 క్యూసెక్కులు - కావేరి అధారిటి
11. వివాదాస్పద భూమితో సహా అయోధ్యలో అప్పగించాలని విహెచ్‌పి అధ్యక్షుడు
12. విహెచ్‌పి అధ్యక్షుని డిమాండును తిరస్కరించిన కేంద్రం.
13. సామాజిక రంగాలకు బడ్జెట్ కోతపై పంత్ ఆందోళన.
    ఎల్.పి.జి సిలిండర్లకు డిపాజిట్ రు. 50లు తగ్గింపు.
    అయోధ్య సమస్యపై కేంద్రప్రభుత్వ అప్పీలును తోసివేసిన సుప్రీంకోర్టు.
    గోధుమ రైతుకు 10 రూ. అదనపు కరువు ధర, పప్పులు, నూనె గింజల ధరల పెంపు రు. 30లు.
    బంగ్లా -భారత్ చర్చలకు బంగ్లాదేశ్ విదేశాంగ మంత్రి రాక.
14. 11 రాష్ట్రాల్లో 85 జిల్లాలకు పాకిన నక్సలిజం - కేంద్ర ప్రభుత్వ విశ్లేషణ.
    శిశు సంక్షేమ పథకాల అమలు 8వ స్థానంలో ఆంధ్ర-కేంద్రం.
    క్లోనింగ్ చేసిన గొర్రె మరణం - మానవ క్లోనింగ్‌పై సందేహం.
15. ప్రపంచంలో చాలా దేశాల్లో యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు.
    మానవ క్లోనింగ్ వద్దు - అబ్దుల్ కలాం

## రాష్ట్రం

2. నక్సలైట్లు బందీగా తీసుకొని వెళ్లిన సబ్ ఇన్‌స్పెక్టర్ విడుదల
3. హైదరాబాద్‌లో సింగరేణి సమ్మెను బలపరుస్తూ సత్యాగ్రహ ప్రయత్నం, అరెస్టులు
5. ప్రభుత్వం తీసుకొన్న భూములకు నష్టపరిహారం చెల్లించనందుకు కలెక్టరుతో సహా ఉద్యోగులందరి జీతాలు నిలిపివేసిన జిల్లా న్యాయశాఖాధికారి
6. కరువుకు రూ.2373కో. ఆర్థిక సహాయం: ముఖ్యమంత్రి అభ్యర్ధన
   గ్రామీణ ఇ-సేవా ప్రాజెక్టు ప్రారంభం
8. బేషరతుగా వస్తే నక్సలైట్లతో చర్చలకు సిద్ధం - ముఖ్యమంత్రి
   స్థానికేతరులను వెనక్కు పంపండి - 610 జీవోకై సభాసంఘం
   ప్రతి నియోజక వర్గానికి 25ల. శ్రేయోనిధిమంత్రి మండలి.
11. అందరిలోకన్నా నెల్లూరు పోలీసులే పెద్దలంచగొండులు - ముఖ్యమంత్రి
    రాష్ట్రంలో బి.జె.పి. బంద్ పిలుపుకు పరిమిత స్పందన
    డాక్టర్లను ప్రతి 4 సంవత్సరాలకు బదిలీ చేయాలి : ముఖ్య మంత్రి
    బి.జె.పి. బలపడిందంటే దానికి కాంగ్రేసే కారణం-సి.సి.ఐ. (ఎం)
    జాతీయ స్థాయిలో సెక్యులర్ శక్తుల సహకారానికి త్రిపుర పరిణామాలు అడ్డురావు - కాంగ్రెస్ అధికార ప్రతినిధి
12. 'బ్రహ్మోస్' మిస్సైల్ విజయవంతంగా ప్రయోగం
13. తెలుగుదేశం నాయకులకు చైర్మన్ పదవుల పంపిణీ ప్రారంభం
    అయోధ్యపై కేంద్రం విజ్ఞప్తికి సుప్రీం "నో"
    రాష్ట్రంలో 280 మండలాల్లో పాతాళానికి నీటిమట్టాలు: భూగర్భ జలాలశాఖ నివేదిక
    రాష్ట్రంలో పునరావాస, సహాయశాఖ పనిస్థాయి అధమం. -ప్రభుత్వ మీడియా ఎనాలసిస్ ఇన్ఫర్మేషన్ సిస్టమ్
    విజయవాడలో ఆక్రమణ దారులపై లాఠిచార్జి
15. ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర: మొదటి సంపుటం విడుదల
    రబీలో 53% తగ్గిన వరిసాగు

"ఏ దేశంలోనైనా కార్మికులు ఎక్కువ సంఖ్యలో కార్మిక సంఘాలలో సభ్యులైనట్లయితే ఆ దేశం మెరుగవుతుందని ప్రపంచ బ్యాంక్ ఒక అధ్యయనంలో తెలియజేసింది. సంఘటిత కార్మికుల పట్ల సంస్థలు ప్రదర్శించే సాంప్రదాయక శతృత్వం దోరణులలో మార్పులు సంభవిస్తున్నట్లు సూచించింది.

"ప్రపంచ బ్యాంక్ గతంలో కార్మిక సంఘాల పట్ల శతృత్వ దోరణితో వ్యవహరించి ఉండవచ్చు. కాని గతానికి భిన్నంగా స్నేహ పూర్వకంగా వ్యవహరించదలుచుకున్నట్లు" తన అధ్యయనం ద్వారా తెలియజేసింది.

- హోల్జ్‌మన్ ప్రపంచ బ్యాంక్ సోషల్ ప్రొటెక్షన్ డైరెక్టర్.

"కార్మికసంఘాలు సక్రమంగా పనిచేసినట్లయితే అవి మార్పుకు కారకాలవుతాయి. దీని అర్థం సంఘాలు సరిగాపని చేయకపోతే, దుష్పరిణామాలు వుండవని కాదు అని హోల్డ్‌మాన్ అన్నారు.

- ఇంటర్‌నెట్ 12-12-02

ఒకవేళ కేంద్ర గణాంకశాఖ (సి.ఎస్.ఓ) అంచనాలు నిజం అయినట్లయితే ప్రధాని కలగనే 8శాతం అభివృద్ధి రేటును మర్చి పోవలసిందే. గత సంవత్సరం 5.6శాతంగా వున్న జి.జి.పి అభివృద్ధి రేటు ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో 4.4శాతానికి తగ్గింది.

వర్షాభావ పరిస్థితుల వల్ల వ్యవసాయ రంగంలో అభివృద్ధి గణనీయంగా తగ్గిపోవడమే అభివృద్ధిరేటు తగ్గిపోవడానికి ప్రధాన కారణం. 2001-02 సంవత్సరంలో 5.7శాతం ఉన్న వ్యవసాయ శాఖ అభివృద్ధి రేటు అంచనాలు ప్రస్తుతం 3.1 శాతానికి తగ్గినాయి. మాన్యుఫాక్చరింగ్, సేవల రంగాల్లో సాధించిన గణనీయమైన అభివృద్ధి రేటు వ్యవసాయరంగాల్లో బాగా తగ్గిన అభివృద్ధి రేటుతో తుడిచి పెట్టుకుపోయింది.

- ఇ.ఎన్.ఎస్.ఎనమిల్ బ్యూరో, ఫిబ్రవరి 7, 03.

రష్యాలో పరిశ్రమ పెడితే చాలా అనుకూల పరిస్థితులు న్నాయి. అక్కడ పరిశ్రమ పెడితే యూరోపియన్ మార్కెట్‌కు దగ్గరవుతాము. నిపుణులైన కార్మికుల జీతం నెలకు రూ॥5000 మాత్రమే. స్త్రీలకు ఉద్యోగాలివ్వటంలో సమస్య లేదు. వాళ్ళు చాలా ఆరోగ్యంగా ఉంటారు. మనం రెండు చేతుల్తో ఎత్తలేని బరువును వారు ఒక్క చేత్తో ఎత్తగలరు. రెడిమేడ్ ఫ్యాక్టరీ స్థలం చదరపు అడుగు మూడు రూపాయలకే లభిస్తుంది. విద్యుచ్ఛక్తి యూనిట్ ఖరీదు 125 పైసలు మాత్రమే. ఉక్కు ఖరీదు మన దేశం ఖరీదులో సగం

- సీతారామన్, సూపర్ ఆటో ఫోర్జ్ మేనేజింగ్ డైరెక్టర్, చెన్నై.

"గడిచిన 200సం॥రాలలో టెక్నాలజీ ధనిక దేశాలను మరింత ధనవంతంగా, పేదదేశాలను మరింత పేదరికంగా తయారు చేసింది"

డాక్టర్ స్వామి మనోహర్ శాస్త్రవేత్త ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ సైన్స్ సింప్యూటర్ కనుగొన్న వారిలో ఒకరు.

ఏరిక్‌సన్, శాంసంగ్, సోని, నోకియా, మిట్స్‌బిషి, బ్యాంక్ ఆఫ్ టోక్యో, డ్యూబే బ్యాంక్ లాంటి 18 కంపెనీలు భారత దేశ విదేశీ మారకం నియమనిబంధనలను ఉల్లంఘించినందుకు భారతప్రభుత్వం వారికి నోటిసులు జారీ చేసింది. జపాన్ ఎయిర్ లైన్స్, ఆల్‌నిప్పన్ ఎయిర్‌లైన్స్, హ్యూందాయ్ మోటార్స్, దాయెవూ మోటార్స్, మెరులేని, మోటరోలా, ఎల్.జి. ఎలక్ట్రానిక్స్, సాన్వాబ్యాంక్, బ్యాంక్ ఆఫ్ నోవా స్కోటియా, సమీరా బ్యాంక్, ప్యూజి బ్యాంక్ కూడా ఫెరా నిబంధనలను ఉల్లంఘించినందుకు నోటీసులు జారీ చేయబడ్డాయి.

- టైమ్స్ ఆఫ్ ఇండియా, ఫిబ్రవరి 22.

రైల్వే వివిధ క్రాసింగ్‌ల వద్ద ఓవర్, అండర్ బ్రిడ్జిల నిర్మాణా నికి రాష్ట్రప్రభుత్వం ఇవ్వాల్సిన 50 శాతం నిధుల వాటాను ఇవ్వటం లేదని, దీనితో కేంద్రం కేటాయించిన రూ.350 కోట్లు మురిగి పోతున్నాయని కేంద్రరైల్వే సహాయ మంత్రి బండారు దత్తాత్రేయ అన్నారు.

- "ప్రజాశక్తి", 16 ఫిబ్రవరి 03

విద్యుత్, నీటిపారుదల, రోడ్లు, భవనాలు, ఆర్థిక శాఖలతో పాటు ఇన్‌ఫర్మెషన్ టెక్నాలజీ వంటి అనేక శాఖల్లో కన్సల్టెంట్స్ విధానం అమల్లో వుంది. సెంటర్ ఫర్ గుడ్ గవర్నమెంట్ (సి.జి.జి) లో ఎక్కువ మంది కన్సల్టెంట్స్ రాష్ట్ర అధికారులే వుండడం గమనార్హం. సిజిజిలో ఇతర దేశస్థుల ఆదిపత్యం అధికం గా ఉండడంతో వెంటనే మార్పులు అవసరమని ఉన్నత స్థాయిలో పరిశీలన జరిగినట్లు చెబుతున్నారు.....

ఆ ప్రయత్నంలో అతిపెద్ద అధికారిగా వున్న ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికిస్తున్న జీతానికి మూడు రెట్లకు మించి కన్సల్టెంట్స్‌కు జీతభత్యాలు అందిస్తున్న ఘనత మన రాష్ట్రానికే దక్కుతుంది. కొందరు నెలకు లక్షన్నర రూపాయల జీతాలు తీసుకొంటున్న వారున్నారు"

- 'వార్త', 14 ఫిబ్రవరి 03.

# Interest Rates Slashed

## Loans for Homes

## Gift for Your Family

For Purchase, Construction, Expansion and Repairs
Housing loans from other approved sources can also be transferred to Andhra Bank



**Slash! Slash! Slash!**

Interest Rates on **Housing Loans** slashed to **9%***

- No Co-obligation/ Guarantee*
- No Salary Undertaking Letter Required*
- Interest on Daily Reducing Balances
- Repayment up to 20 Years
- **Incentives for Prompt Payment**

**Tax Exemption**

On Interest up to Rs. 1,50,000 U/S 23/24(1) • On Principal up to Rs. 20,000 U/S 88

*For details contact your nearest Andhra Bank branch*

**ఆంధ్రాబ్యాంక్ आन्ध्रा बैंक Andhra Bank**

(A Govt. of India Undertaking)

**H.O.: Dr. Pattabhi Bhavan, 5-9-11, Saifabad, Hyderabad 500004. Visit us at: www.andhrabank-india.com**

Conditions Apply.